# చందమామ



సంపుటి 105 జూలై 2001 సంచిక 1

## ఈ సంచికలో...



Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai–600 026 on behalf of Chandamama India Limited, No.82, Defence Officers Colony, Ekattuthangal, Chennai - 600 097. Editor: Viswam

### ఈ నెల విశేషాలు



మాయని మచ్చ! (బేతాళ కథ)



మొండికత్తి మొనగాడు



కృష్ణభూపతి కథ

యక్షపర్వతం



మీ బంధుమిత్రులు విదేశాలలో ఉన్నారా?
దూర తీరాలకు తరలి వెళ్ళాలనుకుంటున్నారా?



అలాంటివారికి, వారి భాషలో వెలువడే చందమామను బహుమతిగా ఇవ్వండి!
వారి సాంస్కృతిక సంపదను- వారి భాషలోనే బహూకరించండి!




## చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**

చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగాని,మనిఆర్డర్ ద్వారాగాని చందమామ ఇండియా లిమిటెడ్ పేరిట కింది చిరునామాకు పంపండి:

SUBSCRIPTION DIVISION
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony,
Ekkattuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందమామ కానుక ఇవ్వండి! ప్రేమానురాగాలు పంచుకోండి!!

సంపాదకుడు
విశ్వం

ఈ పత్రికలో ప్రకటనల కోసం సంప్రదించండి:
చెన్నయ్
ఫోన్ : 044-234 7384, 234 7399
ఢిల్లీ
మోనా భాటియా
ఫోన్:011-651 5111/656 5513/656 5516
ముంబాయి
షకీల్ ముల్లా
ఫోన్ : 022-266 1599/266 1946/265 3057

ఉత్తర ప్రత్యుత్తరాలకు:
చందమామ మేగజైన్ డివిజన్
82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,
ఈక్కాట్టుతాంగల్,
చెన్నయ్ - 600 097.
ఫోన్ : 234 7384, 234 7399
ఫ్యాక్స్ : 234 7384
e-mail : chandamama@chandamama.org

**For USA**
**Single copy $2**
**Annual subscription $20**
***Residents of USA and Canada can mail their remittances to :***
**INDIA ABROAD**
**43 West 24th Street**
**New York,**
**NY 10010**
**Tel: (212) 929-1727**
**Fax (212) 627-9503**
**E-mail:mail@indiaabroad.com**



సంచాలకులు

చక్రపాణి. బి.నాగిరెడ్డి

# జీవితానికి పునాది!

యాభై నాలుగేళ్ళ క్రితం జూలై నెలలోనే చందమామ ప్రారంభించబడింది. చదవడం, రాయడం, గణితం ఈ మూడూ నేర్పడమే ఆ రోజుల్లో విద్యాబోధన ప్రధాన లక్ష్యాలుగా ఉండేవి. ఈనాడు వీటితోపాటు కంప్యూటర్ పరిజ్ఞానం కూడా అక్షరాస్యతలో నాలుగవ అంశమయింది. వీటన్నిటికీ మించి ఐదవ అంశం ఒకటి ఉంది. అదే సత్ప్రవర్తన. వ్యక్తిగత వికాసానికీ, సామాజిక అభ్యున్నతికీ పునాది సత్ప్రవర్తన! ఈ విషయాన్నే ఇటీవల ఒక విద్యావేత్త విద్యార్థులనూ, ఉపాధ్యాయులనూ ఉద్దేశించి ప్రసంగిస్తూ ప్రస్తావించాడు.

సత్ప్రవర్తన కేవలం బోధించడంవల్ల మాత్రమే సిద్ధించేదికాదు. దానిని ఒక్కొక్కరూ శ్రద్ధగా అలవరచుకోవాలి. ధైర్యం,కరుణ,త్యాగం,దేశభక్తి,ధర్మచింతన అంటే మంచి ఆలోచనలు, మంచి పనులు--ఇవన్నీ కలిసినదే సత్ప్రవర్తన అని ఆయన సెలవిచ్చాడు.

పురాణేతిహాసాలు, జానపద కథలు ధీరోదాత్త గుణాలను కీర్తిస్తూనే ఉన్నాయి. మానవజాతి సముద్ధరణకోసం దేవుళ్ళు అవతారాలెత్తి ఆదర్శ కల్యాణ గుణగణాలను ప్రదర్శించినట్టు మన పురాణాలు చెబుతాయి.

ఒకప్పుడు గురువుల పాదాల చెంత కూర్చుని వారి బోధలు విని సత్ప్రవర్తనను అలవరచుకునే అవకాశం మన బాలబాలికలకు ఉండేది. ఇప్పుడు అటువంటి గురువులు లేరు. అయితే, ఆ మహనీయులు రచించిన ఉత్తమ గ్రంథాలు ఉన్నాయి. వాటినుంచి వారి అనుభవాలనూ, ఉపదేశాలనూ చదువుకోవచ్చు. ఉన్నతమైన మానవతా విలువలను అలవరచుకోవచ్చు.

గత ఐదు శతాబ్దాలుగా చందమామలో వెలువడుతూన్న కథలూ, శీర్షికలూ మానవతా విలువలను ప్రతిబింబించేవిగా ఉన్నాయని పాఠకులు తరచూ లేఖలద్వారా తెలియ జేస్తున్నారు. చందమామ త్వరలో మరింత ప్రాచుర్యంగల మాధ్యమం ద్వారా విద్యారంగంలో అడుగుపెట్టనున్నది. ఉన్నతమైన విలువలను కథల రూపంలో విశదపరచగలదని తెలియజేయడానికి సంతోషిస్తున్నాము!

''చందమామ ద్వారా సత్ప్రవర్తన!'' అనే నినాదం దశదిశలా వినిపించే కాలం త్వరలో రానున్నది!



# పాఠకుల లేఖలు

ఆకాశంలో 'చందమామ' చిన్నారులకిష్టం! భారతదేశంలో చందమామ అందరికీ ఇష్టం!! పరిస్థితుల ప్రాబల్యంవల్ల కొంతకాలం 'చందమామ'కు 'గ్రహణం' పట్టినా గ్రహణానంతరం చందమామ కొంగ్రొత్త శీర్షికలతో, ఆకర్షణీయంగా వెలువడుతున్నది. మీరు ప్రచురించే శీర్షికలు పిల్లలకు విజ్ఞానదాయకంగా ఉంటున్నాయి. కాని, కథలు ఎక్కువగా ప్రచురించి శీర్షికలను తగ్గిస్తే బావుంటుంది.



**-జి.వి.రాఘవేంద్రరావు, మచిలీపట్నం** చందమామ పత్రికను కొత్త అందాలతో సాగిస్తున్నందుకు అభినందనలు. 'యక్షపర్వతం' సీరియల్ చాలా బావుంది. 'అద్భుత భారత వినోదయాత్ర' బావుంది.

**-కె.తులసీరావు, మచిలీపట్నం**

గత పది సంవత్సరాలుగా చందమామను చదువుతున్నాను. కథల స్థానాన్ని శీర్షికలు ఆక్రమించడం మాలాంటి పాఠకులకు రుచించడంలేదు. చక్కని కథలు ప్రచురిస్తూన్న చందమామకు ధన్యవాదాలు.

**-కె.సంతోషకుమార్, గోరింట,( శ్రీకాకుళంజిల్లా) 532168**

మే నెల చందమామలోని కథలు, సీరియల్స్ - యక్షపర్వతం, మహాభారతం, చిత్రకథ బావున్నాయి. 'అద్భుత భారత వినోదయాత్ర' చాలా బావుంది.

**-సి.హెచ్.ఎస్. నరేంద్ర, ఎమ్.వి.సాయి, ఆత్మకూరు, (కర్నూలు జిల్లా)**

చిన్ననాటినుంచి ఈనాటివరకూ నేను చందమామ పాఠకుణ్ణి. చందమామ చదివేటప్పుడు చిన్నప్పుడు ఎంత ఆనందాన్ని అనుభవించానో, అలాగే ఇన్నేళ్ళ వయస్సు పెరిగినా ఈనాడూ ఎంతో చక్కని అనుభూతిని పొందుతున్నాను. చందమామ నా జీవిత నేస్తం. స్కూలు పాఠాలు చదివి, పొందిన విజ్ఞానంకంటే చందమామద్వారా రకరకాల శీర్షికలు చదివి పొందగలిగే విజ్ఞానమే ఎక్కువని నా అభిప్రాయం. **-గొట్టాపు దుర్గారావు, జంగారెడ్డిగూడెం.(ప.గో.జిల్లా)**

చందమామ పత్రిక కథలు, బొమ్మలు ప్రత్యేకమైన శైలిలో మొదటినుంచీ వస్తూ వచ్చాయి. ఇప్పటి చందమామ కూడా బాగానే ఉంటున్నది కానీ, కథల సంఖ్య బాగా తగ్గిపోయి, ఇతర శీర్షికలు ఎక్కువైపోయాయి. 1950-90 సం.ల మధ్య ప్రచురించిన కథలు ఏ తరానికైనా విజ్ఞానాన్నీ, వినోదాన్నీ మన సంప్రదాయాలపట్ల అవగాహననూ అందిస్తాయి. సాధ్యమైనన్ని ఎక్కువ పాత కథలు ఇప్పటి పాఠకులకు అందించమని ప్రార్థన. **-కుమార్, విశాఖపట్నం**

# ఈ నెలలో జన్మించిన ప్రముఖులు

## శంకర్

దేశ విదేశాలనుంచి తనకు లభించిన సత్కారా లన్నిటికన్నా, పోలండ్ దేశం పిల్లలు ఇచ్చిన 'ఆర్డర్ ఆఫ్ స్మైల్' అవార్డును ఎంతో ప్రియమైనదిగా భావించాడు శంకర్.

'అంతర్జాతీయ బాలల పోటీ'ని నెలకొల్పిన సుప్ర సిద్ధ వ్యంగ్య చిత్రకారుడైన, శంకర్‌ను ఈ అవార్డుకు ఎంపిక చేశారు. శంకర్ పూర్తిపేరు శంకర్ పిళ్లై. 1902 జూలై 31 వ తేదీ ఆయన కేరళలోని తిరువాన్కూరులో జన్మించాడు.వాళ్లది మాతృస్వామ్య కుటుంబం గనక, అమ్మ ,అమ్మమ్మ మేనమామలవద్ద పెరిగాడు. ఆయన ఒక్కడే సంతానం. ఆడుకోవడానికి తన ఈడువాళ్ళు లేరు. ఇంటి ఆవరణలోకి వచ్చే రక రకాల పక్షులనూ, సీతాకోక చిలుక లనూఎంతోప్రేమగాచూసేవాడు.



ఒకనాడు తరగతిలో లెక్కల మేష్టారు పిల్లల్ని లెక్కలు వేయ మని పురమాయించి, తాను కాళ్ళు తీసి మేజామీద ఉంచి కుర్చీలో నిద్రకు జారుకున్నాడు. ఆ తరగతిలో ఉన్న శంకర్, ఆ దృశ్యాన్ని చిత్రంగా గీశాడు. అదే శంకర్ గీసిన తొలికార్టూన్. కార్టూనిస్టుగా శంకర్ ఆరోజే జన్మించాడు.

1926 లో పట్టభద్రుడయ్యాక బొంబాయిలో ఉంటూ కార్టూన్లు వేయడం ఆరంభించాడు. క్రమంగా ఆయన కార్టూన్లువార్తాపత్రికల్లోచోటుచేసుకోసాగాయి. 1932లో ఆయన 'ది హిందూస్థాన్ టైమ్స్' పత్రికలో కార్టూనిస్టుగా చేరాడు. ఒక పత్రికలో కార్టూనిస్టుగా ఉద్యోగం చేయడం అన్నది మనదేశంలో శంకర్‌తోనే ఆరంభమయింది!

మనదేశం స్వాతంత్ర్యం పొందాక ఆయన 'శంకర్స్ వీక్లీ' అనే విలక్షణమైన ఒక కార్టూను వారపత్రి కను ప్రారంభించాడు. తొలి ప్రతిని ఆవిష్క రిస్తూ ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ, "శంకర్! నన్నూ వదిలిపెట్టవద్దు!" అని సలహా ఇచ్చాడు. ఆరోజు నుంచి 1964 వరకు నెహ్రూకు సంబంధించిన 1500



కార్టూన్లు వెలువడ్డాయి. ఆ పత్రికకూ, రాజనీతి వేత్తకూ కూడా ఇది రికార్డే!




1949 పిల్లల ప్రత్యేక సంచిక ప్రచురించ డానికి మనదేశం పిల్లలనుంచి చిత్రాలనూ, రచన లనూ ఆహ్వానించాడు. ఆయేడు డిసెంబర్‌లో మొట్టమొదటిసారిగా పిల్లల ప్రత్యేకసంచిక వెలు వడింది. మరుసంవత్సరం పదమూడుదేశాల నుంచి పిల్లలు ఎంట్రీలు పంపారు. ఈ 'అంతర్జాతీయపోటీ' ఇప్పుడు 52సంవత్సరాలుపూర్తి చేసుకున్నది.

1950 నుంచి శంకర్ 'బాలల చిత్రాల ప్రదర్శన' ఏర్పాటుచేశాడు. పిల్లలు స్వయంగా అక్కడికి వచ్చి బొమ్మలుగీసే ప్రత్యక్ష పోటీనికూడా ఆయన ప్రవేశ పెట్టాడు.

ఆ తరవాత ఆయన 'చిల్డ్రన్స్ బుక్ ట్రస్ట్' ఏర్పాటు చేయడానికి పూను కున్నాడు. అందుకోసం న్యూఢిల్లీలో ప్రత్యేకంగా 'నెహ్రూ హౌస్' అనే ఐదంతస్థుల భవనం నిర్మిం చాడు. అన్ని భాషలూ కలుపు కుంటే ఈ సంస్థ వెయ్యి ప్రచు రణలను అందుకోనున్నది. చిత్ర కళలో, రచనా వ్యాసంగంలో పిల్ల లకు ఉన్న ఆసక్తిని పెంపొందించడానికి ఆయన 1968లో 'చిల్డ్రన్స్ వరల్డ్' (బాలల ప్రపంచం) అనే పత్రికను ప్రారంభించాడు. బాలల సృజనాత్మక శక్తులను ప్రోత్సహించడానికే ఈ పత్రికలో ఎక్కువ పుటలు కేటాయించబడుతున్నది. 1965లో పిల్లలకోసం ఒక గ్రంథాలయాన్నీ,పఠనా మందిరాన్నీ ఏర్పాటుచేశాడు.

హంగరీ నుంచి ఆయనకు ఒక 'కాస్ట్యూమ్ డాల్' బహుమతిగా వచ్చింది. అప్పటి నుంచి ఆయన ఇతర దేశాలనుంచి కూడా అలాంటి బొమ్మలను సేకరిం చాడు.

'నెహ్రూ హౌస్'లో వున్న ఇంటర్నేషనల్ డాల్స్ మ్యూజియంలో వందదేశాలకు చెందిన దాదాపు 8,000 బొమ్మలు ఉన్నాయి.

1989 డిసెంబర్ 26 వ తేదీ శంకర్ కీర్తిశేషు డయ్యాడు. పసిహృదయాలను చిరునవ్వులతో నింపడానికి ఆయన జీవితమంతా నిర్విరామంగా కృషిచేశాడు!




బేతాళ
కథలు

# మాయని మచ్చ!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ‘‘రాజా, తలచుకుంటేనే భీతిగొల్పే శ్మశానంలో, ఇంత అర్ధ రాత్రివేళ ఎవరికి మేలు చేయగోరి, ఇంత కఠిన శ్రమకు పూనుకున్నావో అర్థం కావడంలేదు. పూర్వం గవరయ్య అనేవాడు, బంధుప్రీతి కొద్దీ అసహాయ స్థితిలోవున్న వందన అనే అమ్మాయికి సహాయపడి, చివరకు పదిమందిలోనూ నవ్వుల పాలయ్యాడు. నీవూ అలాంటి పరిస్థితికి గురికాకుండా తగు జాగ్రత్తలోవుండేందుకు, అతడి



కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

చక్రపురంలో గవరయ్య, శరభయ్య అనే ఇద్దరు మిత్రులున్నారు. శరభయ్య కలిగిన వాడే కానీ పొదుపరి. అయితే, అతడు సొంతానికి మాత్రం పొదుపుగా వుంటూ, అవసరంలోవున్నవారిని ఆదుకోవడంలో వితరణ చూపేవాడు. గవరయ్య, ఆదాయానికి మించిన వ్యయం చేసే దుబారా మనిషి.

గవరయ్య తరచుగా శరభయ్యను, ''ఉన్నదంతా కట్టుకుపోతావా? బ్రతికున్నంత కాలం సుఖాలు అనుభవించాలి. నీకు డబ్బుంది కానీ అనుభవించే యోగంలేదు,'' అని ఎద్దేవా చేస్తుండేవాడు.

అందుకు బదులుగా శరభయ్య, ''ఏ అనుభవమైనా సంతోషం కోసమే గదా! ఆ సంతోషం నాకు పుష్కలంగా వున్నది. నీకు నీ సంతోషం కంటే, నా గురించిన వ్యథే ఎక్కువగా వున్నట్లున్నది. అందుకు కారణం నీ అప్పులు, నా నిల్వలు. ఉన్నంతలోనే స్వసుఖాలకూ, పరోపకారానికీ వినియోగిస్తూ, ఇతరుల మీద ఆధారపడకుండా వుండడానికి కొంత దాచుకుంటూ వుంటే నీకూ అప్పులుండవు, నిల్వలూ పెరుగుతాయి,'' అంటూ చురకవేసేవాడు.

దీనికి గవరయ్య ఒప్పుకోక, ''నేను పరోపకారిని. నా అప్పులన్నీ పరోపకారానికే చేశాను. పరోపకారం చేసేటప్పుడు నాకు ఒళ్ళు తెలియదు. అందువల్ల నావంటివాడికి నిల్వలుండవు!'' అంటూ ఉక్రోషపడేవాడు.

''గవరయ్యా!నీమంచికోరి చెబుతున్నాను. నువ్వు దుబారా మనిషివని ఒప్పుకో, లేదా నీ ఖర్చులన్నీ పద్దురాయి. పరోపకారి నంటూ దంబాలు పలికితే, ఏదో రోజున నీకు మాయనిమచ్చ రాగలదు, జాగ్రత్త!'' అంటూ ఒకసారి శరభయ్య, గవరయ్యను హెచ్చరించాడు.

గవరయ్య మిత్రుడి మాటలకు ఏ కొంచెం కూడా కోపగించుకోక, ''శరభయ్యా! భగవంతుడు మనిషికి భిన్న ప్రవృత్తులనిచ్చాడు. నీ పద్ధతినీది,నాపద్ధతినాది.దీన్నిగురించి చర్చలు అనవసరం,'' అంటూ తేల్చి పారేశాడు.

ఆ తర్వాత వాళ్ళిద్దరూ డబ్బు, ఖర్చులను గురించి మాట్లాడుకునేవారు కాదు.

అయితే, అనుకోకుండా ఆ అవసరం రానే వచ్చింది. చక్రపురానికి దాదాపు నూరు క్రోసుల దూరంలో వుండే స్వర్ణపురంలో భూకంపం వచ్చి ఇళ్ళన్నీ కూలిపోయాయి. ఎంతో ప్రాణ నష్టం జరిగింది.

అలాంటి పరిస్థితుల్లో ఒక వ్యక్తి ఆ ఊరుకు వందన అనే పదేళ్ళ అమ్మాయిని తీసుకువచ్చాడు. భూకంపంలో అనాధ అయిన ఆ పిల్లకు గవరయ్య దూరపు బంధువు. అదేసమయంలో గవరయ్య కుటుంబ సమేతంగా తీర్థయాత్రలకు వెళ్ళి వున్నాడు. అప్పుడు శరభయ్య, "గవరయ్య బంధువు నాకూ బంధువే. ఈమె నా ఇంట వుంటుంది," అని చెప్పగానే, వచ్చిన వ్యక్తి వందను అతడికి అప్పగించి వెళ్ళిపోయాడు.

కొన్నాళ్ళకు గవరయ్య తీర్థ యాత్రలు ముగించుకుని ఊరికి తిరిగివచ్చాడు. శరభయ్య ద్వారా జరిగింది తెలుసుకుని, "తీర్థయాత్రల్లో దానధర్మాల పేరిట బోలెడు డబ్బు ఖర్చు చేశాను. ఇప్పుడు మరొక మనిషిని పోషించడం నావల్లకాదు. అందులోనూ వందన ఆడపిల్ల. దానికి నగలు కొనాలి. పట్టుబట్టలు కొనాలి. పెళ్ళికొడుకును కొనాలి. నువ్వు అనాలోచితంగా, నా వీపుమీద మరింత బరువు వేశావు. నేనుండి వుంటే వందనను ఆ తీసుకువచ్చిన మనిషితో వెనక్కు పంపేసి వుండేవాణ్ణి," అంటూ లబోదిబోమన్నాడు గవరయ్య.

శరభయ్య అతణ్ణి ఓదార్చి, "దేవుడి దయ వల్ల నా పరిస్థితి కాస్త మెరుగ్గానే వున్నది. నీకు అభ్యంతరం లేకపోతే, వందన మాఇంట్లోనే వుంటుంది. దాని బరువు బాధ్యతలు నేనే వహిస్తాను," అన్నాడు.

"నా బంధువును నువ్వు పోషిస్తే నాకు చెడ్డ పేరు వస్తుంది. కాబట్టి, వందన నాకంటే నీకే బాగా దగ్గర బంధువని అందరికీ చెప్పాలి," అన్నాడు గవరయ్య.



శరభయ్య ఈ షరతుకు అంగీకరించాడు. అలా ఆరుమాసాలు గడిచాయి. శరభయ్యకు స్వర్ణపురం నుంచి పిలుపు వచ్చింది. ఆ దేశపురాజు స్వర్ణపురానికి అందజేస్తున్న సహాయం సక్రమంగా వినియోగం కావడం లేదనీ, అందుకు సమర్థుడూ, నమ్మకస్థుడూ, పరోపకారీ అయిన మనిషి కావాలనీ వివిధ గ్రామాలకూ ఉత్తరువులు పంపితే, అలాంటిది చక్ర పురానికీ ఒకటి వచ్చింది. చక్రపురం గ్రామాధికారి శరభయ్య వివరాలు పంపాడు. రాజు, శరభయ్యను స్వర్ణపురానికి రాజ ప్రతినిధిగా ఎంపిక చేశాడు.

శరభయ్య దీనికి అంగీకరించాడు కానీ వందన స్వర్ణపురం పేరు చెబితే వణికిపోతున్నది – అప్పటి భూకంపాన్నే తల్చుకుని. వైద్యుడి సలహా మీద వందనను చక్రపురంలోనే విడిచి వెళ్ళాలనుకున్నాడు, శరభయ్య.



అలాంటి సమయంలో గవరయ్య, శరభయ్య వద్దకు వచ్చి, "నీ ఇబ్బంది నాకు అర్థమైంది. పరోపకారానికి పోయి కొత్తగా ఆర్థిక ఇబ్బందులు తెచ్చుకున్నాను. నువ్వు నా అప్పులన్నీ తీర్చావంటే, సంతోషంగా జీవితాంతం వందన బాధ్యతలు స్వీకరిస్తాను," అన్నాడు.

"గవరయ్యా! నువ్వు కోరినట్లే చేస్తాను. నువ్వు జీవితాంతం వందన బాధ్యతలు స్వీకరిస్తానన్నప్పటికీ, ఆ మాటకుకట్టుబడివుండటం కష్టం. ఎప్పుడు అవసరపడినా నేను నీకు ధనసాయంచేస్తూనేవుంటాను," అని వందనను, గవరయ్యకు అప్పగించి, సకుటుంబంగా స్వర్ణపురానికి వెళ్ళాడు, శరభయ్య.

ఏడాది కొకసారి శరభయ్య చక్రపురం వచ్చి వందనను చూసి వెళుతూండేవాడు. వందన ఆ ఇంట ఎంతో సుఖసంతోషాలతో వుంటున్నదని గ్రహించి సంబరపడుతూండేవాడు. అయితే, వందన గవరయ్యను స్వంత మనిషిలాగానూ, తనను పరాయివాడిలాగానూ చూడడం ఎంతో బాధగా అనిపించేది.

చాలా ఏళ్ళు గడిచాయి. వందన తన పట్ల ముభావంగా వుంటున్నదని గ్రహించి శరభయ్య క్రమంగా చక్రపురం వెళ్ళడం మానుకున్నాడు. అయితే, గవరయ్య డబ్బు అవసరాల విషయంలో మాత్రం అతడు ఏ లోటూ చేసేవాడు కాదు.

ఇలా వుండగా, స్వర్ణపురానికి శేఖరుడనే ఒక మహాకవి వచ్చాడు. రాజప్రతినిధిగా శేఖరుడికి అతిథి సత్కారాలంద జేయవలసిన బాధ్యత, శరభయ్యది. అతడు తన విధిని సక్రమంగానిర్వహించి శేఖరుడి అభిమానాన్ని చూరగొన్నాడు.

శేఖరుడికింకా వివాహం కాలేదు. అతడు అందగాడే కానీ ముఖాన కుడి బుగ్గపై చింతగింజంత నల్లని మచ్చ వుంది. అది పోయేదాకా పెళ్ళి చేసుకోకూడదని ఆయన నిశ్చయించుకున్నాడు. దేవుడిచ్చిన మచ్చ ఎలా పోతుందని శరభయ్య ఆశ్చర్యపడ్డాడు.

"అది దేవుడిచ్చిన మచ్చకాదు! నేనింకా విద్యాభ్యాస దశలోవున్నప్పుడు, నా గురువు రాసిన కావ్యాన్ని నాదనిచెప్పుకుని, ఒక జమీందారుగారి నుంచి సన్మానం పొందాను. అందుకు నా గురువు కోపించి, నానేరం మచ్చగామారి నా ముఖాన్నే అంటుకుని వుంటుందని శపించాడు. ఇతరుల గొప్పదనాన్ని తనదని చెప్పుకోవడంలో నన్ను మించినవాణ్ణి, నేను గుర్తించినప్పుడీ మచ్చ, నా నుంచి అతడి ముఖానికి మారుతుందని,

ఆయన శాపపరిహారం చెప్పాడు. ఇంతవరకూ నాకు శాపపరిహారం చేయగల వ్యక్తి దొరక లేదు,'' అన్నాడు శేఖరుడు.

అప్పుడు శరభయ్య, ''బాబూ! నీవు తప్పు చేసి వుండవచ్చును. కానీ అది తెలుసు కున్నావు. ఇప్పుడు నీవు నిజంగానే మహాకవివి కాగలిగావు. నీ మచ్చ నీముఖానికి అందాన్నే ఇచ్చింది. నీ వంటి ఉత్తముడికి తగిన ఇల్లాలు చక్రపురంలోవున్నది. ఆమెకిప్పుడు పద్ధె నిమిదేళ్ళు, పేరు వందన. నీవామెను పెళ్ళా డితే ఎంతయినా సంతోషిస్తాను,'' అంటూ, అతడికి వందన కథ చెప్పాడు.

''నాయీ మచ్చను చూసి ఎందరో చీద రించుకున్నారు. వందన నన్ను చీదరించుకోని పక్షంలో, నేనామెను తప్పక పెళ్ళి చేసు కుంటాను. మనం చక్రపురం వెళదాం,'' అన్నాడు శేఖరుడు.

శరభయ్య కొద్దిసేపు తటపటాయించి, ''ఎందువల్లనో వందనకు నేనంటే అసం తృప్తి వున్నది. ఇంతకు ముందే వందనకు, గవరయ్యతో వున్న బంధుత్వం సంగతి చెప్పానుగదా! నీవు, వందన పరస్పరం ఇష్ట పడితే, పెళ్ళి వేళకు నేనక్కడికి వస్తాను,'' అన్నాడు.

శేఖరుడు చక్రపురం వెళ్ళాడు. గవరయ్య సంగతి తెలుసుకుని చాలా సంతోషించాడు. వందనశేఖరుడంటే ఇష్టపడింది. అతడికామె నచ్చింది. వెంటనే పెళ్ళిముహూర్తం నిశ్చ యమై శరభయ్యకు కబురు వెళ్ళింది. పెళ్ళి వైభవంగా జరగడానికి డబ్బు ఏర్పాట్లన్నీ చేసుకుని, శరభయ్య ఆనందంతో పెళ్ళికి వెళ్ళాడు.



గవరయ్యకు ఆడపిల్లలులేరు. అందు వల్ల, ఆయనే కన్యాదానం చేశాడు. పెళ్ళ య్యాక వధూవరులిద్దరూ పెద్దలకు పాదాభి వందనం చేయాల్సివుంది. శేఖరుడు ముందుగా శరభయ్య వద్దకు వెళ్ళబోగా వందన వారించి, ''భూకంపం తర్వాత, నాకీ ఊళ్ళో ఆశ్రయం లభించడానికి కారణం శరభయ్యగారు. అయితే, నాకోసం తన జీవి తాన్ని అంకితం చేసింది గవరయ్యగారు. గవరయ్యగారి పక్కనే నిలబడి ఆయనకు ధైర్యంగా వున్నందుకు, మనం శరభయ్య గారికీ పాదాభివందనం చేయాలి. అయితే, ఆయన స్థానం గవరయ్య గారి పక్కనే తప్ప ముందుకాదు. మనం ముందు గవరయ్య గారికి పాదాభివందనం చేద్దాం,'' అన్నది.

శేఖరుడేదో అనబోయేంతలో ఒక విచిత్రం జరిగింది. ఉన్నట్టుండి గవరయ్య కుడి బుగ్గ

మీద చింతగింజంత నల్లని మచ్చ వెలిసింది. శేఖరుడి ముఖంపైన పెళ్ళిచుక్క మాత్రం మిగిలి పూర్వపు మచ్చ మాయమైంది.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, గవరయ్య, వందనను శరభయ్యను మరిపించేలా పెంచాడు. వందన ఆ ఇంట ఎంతో సంతోషంగానూ, ఉత్సాహంగానూ వున్నది. శరభయ్య దూరంగావున్నాడే తప్ప, దగ్గరుండి వందన బాగోగులు చూసుకోలేదు. అందువల్ల వందన, గవరయ్యకు ప్రథమ స్థానాన్నిచ్చింది. అది న్యాయం కూడా! ఒకవేళ అన్యాయమే అయినా, ఆ అన్యాయం వందనది. మరి మాయనిమచ్చ గవరయ్య ముఖానికి మారడం, ఏం న్యాయం? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శరభయ్య లేకుంటే వందనకు చక్రపురంలో స్థానముండేది కాదు. శరభయ్య ఆదుకుంటానంటేనే గవరయ్య, వందనను తన ఇంట వుంచుకున్నాడు. నిజానికి వందన తనకు దూరపు బంధువైనా, ఆమె బాధ్యత తనది కాదనీ, శరభయ్యదేననీ గవరయ్య భావించినట్లు ఎన్నో నిదర్శనాలున్నాయి. వందన స్వర్ణపురానికి తిరిగి వెళ్ళేందుకు భయపడకపోతే, ఆమె శరభయ్య ఇంట్లోనే పెరిగి వుండేది. వందన పేరు చెప్పి గవరయ్య అప్పులు తీరాయి. అతడి పరిస్థితి మెరుగైంది. ఇన్ని జరిగినా వందనను ఇంట వుంచుకుని పెంచినందుకు గవరయ్యకే ప్రథమస్థానం లభించడం అసమంజసం కాదు. కానీ వందన పెంపకంలో శరభయ్య పాత్ర ఏమిటో వందనకు తెలియదని, ఆమె మాటలను బట్టి గ్రహించవచ్చు. అంటే, గవరయ్య ఆమెకు శరభయ్య గురించి ఏమీ చెప్పకుండా, అంతా తనే చేసినట్లు చెప్పి వుండాలి. అందుకే వందన, శరభయ్యతో ముభావంగా వుండేది. వందన పెంపకం గురించి, శరభయ్య ద్వారా అంతావిన్న శేఖరుడు, వందనమాటలు వినగానే శరభయ్య ఔదార్యాన్ని గవరయ్య తనదని చెప్పుకున్నట్లు గ్రహించాడు. అది నిజంకూడా కావడంతో మచ్చగవరయ్య ముఖానికి మారింది," అన్నాడు,

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. -(కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]





# యక్షపర్వతం

## 7

[సమరబాహుణ్ణీ, అతడి అనుచరుణ్ణీ ఎలుగుబంటు ముఠావాళ్ళు తమ బిలదుర్గంలోకి తీసుకు పోయారు. ఖడ్గజీవదత్తులు, ఒకచోట పొగలేస్తున్న ప్రదేశాన్నిచేరి, అది బిలదుర్గం అని గుర్తించి లోపలికి వెళ్ళారు. అక్కడ వాళ్ళను గురుభల్లూకుడి మనుషులు ఎదురుపడి పట్టుకుని, ఒక సొరంగ మార్గం వెంట తోడేళ్ళబండ దగ్గరకు తీసుకుపోసాగారు. తరవాత-]

చీకటిమయంగా వున్న సొరంగమార్గంలో, ఎలుగ్గొడ్డువాళ్ళు కొంతదూరం ఖడ్గజీవదత్తులను నడిపించుకుపోయి, ఒకచోట ఆగారు. ముందున్న ఎలుగ్గొడ్డువాడు తన తోటివాడితో, ''ఒరే, అన్నా! ఈ బందీలిద్దరూ తోడేళ్ళబండ అంటే, ఏదో వినోదస్థలం అనుకుంటున్నట్టున్నది. లోగడ మనం పట్టుకువచ్చినవాళ్ళు అందరూ కూడా తోడేళ్ళ అరుపులు వింటూనే భయంతో గజగజలాడిపోయేవాళ్ళు. వీళ్ళకు తోడేళ్ళబండ ఏమిటో కాస్త చూపిద్దామా?'' అన్నాడు.

''సరే, అలాగే కానీ,'' అన్నాడు రెండో వాడు కాస్త విసుగ్గా.

ఆ వెంటనే మొదటివాడు చేతులెత్తి,గుహ పైభాగానవున్న కొక్కెంలాంటిదాన్నిపట్టుకుని బలంగా లాగాడు. ఆ మరుక్షణం అక్కడ అమర్చివున్న చిన్న తలుపొకటి తెరుచుకుని, సొరంగంలోకి వెన్నెల వెలుగు వెల్లువలా వచ్చి పడింది. ఆ వెలుగులో జీవదత్తుడు సొరంగ మార్గాన్ని పరీక్షగా చూసి, ''ఖడ్గా, ఇది మనం అనుకున్నట్టు ఏదో చిన్న బిలం కాదు! ఇక్కడ వీళ్ళు బయటి ప్రపంచానికి తెలియకుండా బతకవచ్చు,'' అన్నాడు.

ఆ మాటలకు ఎలుగ్గొడ్డువాడొకడు పెద్దగా నవ్వి, ''ఆహాఁ, బాగా గ్రహించావు. మీరు తోడేళ్ళబండ దగ్గరనుంచి ప్రాణాలతో వారం



రోజుల్లోతిరిగి ఈసొరంగమార్గాన్ని చేరగలిగితే, మీ జీవితాలు గురుభల్లూకుడి సేవలో హాయిగా గడిచిపోతాయి,'' అన్నాడు.

ఖడ్గజీవదత్తులు తెరుచుకున్న తలుపు ల్లోంచి బయటికి చూశారు.అక్కడవిశాలంగా వున్న ఒకసమతల ప్రదేశంలో పదిపన్నెండడు గుల ఎత్తున ఒక రాతిబండ వున్నది. దానిమీద ఇద్దరు మనుషులు ఈటెలు పట్టుకుని,కింది నుంచి తమ కేసి ఎగురుతున్న తోడేళ్ళను అది లిస్తున్నారు.కొన్ని తోడేళ్ళుభీకరంగా అరుస్తూ, బండచుట్టూ గిరికీలు కొడుతున్నది.

''ధరించిన దుస్తుల తీరునుబట్టి, బండ మీద వున్న వాళ్ళిద్దర్లో ఒకడు సమరబాహులా కనబడుతున్నాడు,'' అన్నాడు జీవదత్తుడు.

''ఏ బాహోగాని,వాడూవాడి అనుచరుడూ నాలుగైదు గంటల్లో, తోడేళ్ళకు ఆహారమై పోతారు. మీరూ ఆ బండమీదికే పోతున్నారు గనక, మీకూ వాళ్ళగతే పడుతుంది. కాని, వృకేశ్వరీదేవి కరుణవల్ల మీరు బతికి రాగలి గారో, ఆ తర్వాత గురుభల్లూకుడి పాద సేవలో....''

ఎలుగ్గొడ్డుభటుడు మాట ముగించే లోపలే, జీవదత్తుడు వాణ్ణి గట్టిగా కసురుతూ, ''ఊరికే వసపిట్టలా గురుస్తోత్రం చెయ్యకు! మేం ఇక్కణ్ణించే ఆ బండదగ్గరికి పోవాలికదా? అలాగే వెళతాం.ఇకమీదారిన మీరు పొండి,'' అన్నాడు.

''ఆహా! ఎంత సాహసం? మీరు స్వయంగా ఆ బండదగ్గరికిపోవడమే!'' అంటూ ఎలుగ్గొడ్డు భటుల్లో ఒకడు ఆశ్చర్య పోయాడు.

''సరే, మమ్మల్ని అక్కడికి ఎలా చేర్చదలి చారు?'' అని అడిగాడు ఖడ్గవర్మ.

''చావడానికి అంత తొందరెందుకు, రండి!''అంటూఎలుగొడ్డుభటులు, వాళ్ళను సొరంగ మార్గంలో మరి కొంతదూరం తీసుకు పోయారు. అక్కడ వాళ్ళకొక నలుచదరపు రాతిపలక కనిపించింది.

భటులు ఆ పలకలో బిగించివున్న ఇనుప కమ్మీని పట్టుకుని బలంగా లాగారు. పలక పక్కకు జరిగి తోడేళ్ళ బండమీదవున్న సమర బాహూ,అతడి అనుచరుడూ ఖడ్గజీవదత్తు లకు కనిపించారు.

రాతిపలక పక్కకు జరిగేటప్పుడయిన శబ్దం వింటూనే సమరబాహు,ఎగిరి ఒకగంతు వేసి, ''అరే, చందూ! రాతిబండ పొట్టలోంచి తోడేళ్ళు పైకొస్తున్నవి!'' అంటూ అరిచాడు.

ఖడ్గజీవదత్తులు బండపైకెక్కుతూ, ''మేం తోడేళ్ళంకాదు, నీలాంటి మనుషులమే!

భయపడకు సమరబాహూ, నీ మిత్రులం,'' అన్నారు.

ఖడ్గజీవదత్తుల్ని చూసి సమరబాహు పొందిన ఆశ్చర్యం అంతా ఇంతా కాదు. అతడేదో అనబోయేంతలో, ఎలుగ్గొడ్డు భటులు రాతి పలకను పైకెత్తి కంతను మూసేస్తూ, ''మీరందరూ మిత్రులేనా, అయితే తోడేళ్ళమందకు కలిసికట్టుగా విందు భోజనం కండి!'' అన్నారు.

జీవదత్తుడు, సమరబాహు భుజంతట్టి ధైర్యం చెబుతూ, ''స్వర్ణాచారిద్వారా సంగతంతా విన్నాం. మనం అందరం సురక్షితంగా, ఈ తోడేళ్ళబండ మీదినుంచి మన ప్రాంతాలు చేరగలం. భయపడవద్దు. నా మాట నమ్ము!'' అన్నాడు.

అంతలో ఆకలిగొన్న తోడేలొకటి కుప్పించి పైకెగిరి, రాతిబండలో వున్న పగుళ్ళలో ఒక చోట ముందు కాళ్ళతో బలంగా పట్టుకుని బండ పైకి పాకాలని చూసింది. ఖడ్గవర్మ చప్పున ముందుకు వంగి కత్తితో దాని తల మీద బలంగా కొట్టి, మెడ పట్టుకుని పైకి లాగి బండ మీద పడవేశాడు.

జీవదత్తుడు, ''ఖడ్గా, చాలా మంచిపని చేశావు!'' అని, సమరబాహును, ''ఎలుగ్గొడ్డు ముఠావాళ్ళు తోడేళ్ళకు ఆహారం ఏ సమయాల్లో వేస్తారో, నీకు తెలుసా?'' అని అడిగాడు.

''ఈ క్రూరమృగాలకు వాళ్ళు సూర్యోదయ, సూర్యాస్తమయ సమయాల్లో ఏ జంతు మాంసమో తెచ్చి వేస్తారు. అందుకోసం వాళ్ళు, ఆ కనబడే గోడకు బిగించివున్న తలుపును తెరుస్తారు,'' అన్నాడు సమరబాహు.



ఆ తర్వాత కొంతసేపటికి సూర్యోదయం అవుతూండగా, బండచుట్టూవున్న తోడేళ్ళు భీకరంగా అరుస్తూ, సొరంగమార్గం వైపున వున్న తలుపు కింద తచ్చాడసాగినై.

జీవదత్తుడు, ఖడ్గవర్మకు ఆ తలుపును చూపుతూ, ''ఎలుగ్గొడ్డు ముఠావాళ్ళు, ఆ తలుపు తెరిచి తోడేళ్ళకు ఆహారం విసరబోతున్నారన్నమాట! ఏదీ, నీ విల్లంబులు బయటికి తీసి, ఆ తలుపుకు గురిచేసి వుంచు!'' అన్నాడు.

జీవదత్తుడు చెప్పినట్టే ఖడ్గవర్మ బాణాన్ని ఎక్కుపెట్టి, తోడేళ్ళబండ మీద తాపీగా కూర్చున్నాడు. ఒకటి, రెండు క్షణాలు గడిచే లోపల, సొరంగమార్గంపై నున్న తలుపు కిర్రుమంటూ తెరుచుకున్నది. ఇద్దరు ఎలుగ్గొడ్డు వాళ్ళు జంతుమాంసంతో నిండివున్న పెద్ద తట్టనొకదాన్ని పైకెత్తి, మాంసాన్ని బయటికి వేయబోతున్నారు. అదే సమయంలో, ఖడ్గవర్మ



గురిచూసి వదిలిన బాణం రివ్వుమంటూ పోయి, ఒక ఎలుగ్గొడ్డువాడి నొసటి మధ్య రప్పీమంటూ బలంగా తగిలింది. వాడు ఒకచావు కేక పెట్టి వెనక్కు విరుచుకు పడిపోయాడు. వాడితోపాటు రెండవభటుడూ, మాంసం తట్టా సొరంగ మార్గంలో దభీమంటూ పడిపోయినై.

ఆ వెంటనే బిలంలో కలకలం లేచింది. వృకేశ్వరీదేవి ముందు పద్మాసనం వేసుక్కూర్చుని ధ్యానముద్రలో వున్న గురుభల్లూకుడికి, ధ్యానభంగమయింది. అతడు కోపంగా లేచి నిలబడి, "ఏమిట్రా గంద్రగోళం? నిన్న దొరికిన బందీలను తోడేళ్ళు పట్టుకుతింటున్నవా?" అని అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చిన భటుణ్ణి ప్రశ్నించాడు.

"గురుభల్లూకా! పెద్ద ప్రమాదమే జరిగింది. తోడేళ్ళ బండపై వున్న బందీ ఒకడు, మన వాణ్ణి బాణం కొట్టి చంపాడు," అన్నాడు.

గురుభల్లూకుడు కళ్ళెర్ర చేసి, ముక్కుపుటాలు అదురుతూండగా, "వృకేశ్వరీదేవి ప్రియభక్తుణ్ణయిన నా శక్తి సామర్థ్యాల ముందు, ఆ అల్పమానవులేపాటి! ఇప్పుడే వాళ్ళిద్దర్నీ, నా పంచశూలానికి ఆహుతి చేయబోతున్నాను," అంటూ తోడేళ్ళబండ దగ్గరకు బయల్దేరాడు.

కొద్దిసేపట్లో గురుభల్లూకుడు సొరంగ ద్వారం దగ్గరకు వచ్చి, తోడేళ్ళబండమీద వున్న బందీలనుచూసి కళ్ళెర్రచేసి, "ఒరే, పాషండుల్లారా! బాణంకొట్టి వృకేశ్వరీభక్తుల్లో ఒకణ్ణి చంపారు. ఇదే, మిమ్మల్ని నా పంచశూలానికి గుచ్చి తోడేళ్ళకు ఆహారంగా వేయబోతున్నాను," అన్నాడు భీకరమైన కంఠస్వరంతో.

ఆ మాటలకు జీవదత్తుడు నవ్వి, తన చేతిలోని దండాన్ని పైకెత్తి, "అరే ఒరే, గురుభల్లూకా! నువ్వు భల్లూకుడివై వుండి, ఏ భల్లూకేశ్వరినో పూజించక వృకేశ్వరినెందుకు పూజిస్తున్నావో తెలియడంలేదు. ఇదిగో, నేను బండ దిగి, నీ సొరంగ ద్వారం దగ్గరకు వస్తున్నాను," అన్నాడు.

సమరబాహు, జీవదత్తుణ్ణి వారిస్తూ, "అయ్యా, మీరు ఆకలిగొన్న తోడేళ్ళ మధ్యగా నడిచిపోయి, ఆ గురుభల్లూకుణ్ణి చేరాలని చూస్తున్నారా? అది చాలా ప్రమాదం.గురుభల్లూకుడు మంత్ర తంత్ర విద్యల్లో ఆరితేరిన ఘటం!" అన్నాడు.

ఖడ్గవర్మ తన చేతిలోవున్న ఖడ్గాన్ని పైకెత్తి పట్టుకుని, "సమరబాహూ! ఈ ఖడ్గంలోనూ, జీవదత్తుడి చేతిలోవున్న దండంలోనూవున్న మంత్ర శక్తులు తిరుగులేనివి! గురుభల్లూకుణ్ణి చూసి భయపడకు," అన్నాడు.

జీవదత్తుడు, సొరంగద్వారం వద్ద వున్న గురుభల్లూకుడికేసి ఒకసారి పరీక్షగా చూసి, ఖడ్గవర్మతో, ''ఖడ్గా, ఇక్కడినుంచి బయటపడడానికి ఒకే ఒక ఉపాయం తోస్తున్నది. మనం లోగడ పద్మపురం రాజును, అరణ్యంలో సింహాలను వేటాడుతూ పరిచయం చేసుకున్నామే-అదే పద్ధతిలో ఈ తోడేళ్ళను వేటాడి, భల్లూకుడి బిలదుర్గాన్ని అల్లకల్లోలపరచాలి,'' అన్నాడు.

''ఊ, అలాగే చేద్దాం. మరి ఆలస్యమెందుకు?'' అన్నాడు ఖడ్గవర్మ ఉత్సాహంగా.

జీవదత్తుడు, ఖడ్గవర్మకు ఏం చేయాలో చెప్పి, ''ముందు ఆ చచ్చిన తోడేలును భుజం మీద వేసుకో. ఆకలితోవున్న తోడేళ్ళు దానిమాంసంకోసం, నీ వెంటబడితే, అప్పుడు నీకత్తికిచాలాపని తగులుతుంది!'' అన్నాడు.

''జీవా! మాటలతో కాలయాపన అయిపోతున్నది. ఈ తోడేలు శవాన్ని ఎంతసేపని మోసేది!'' అన్నాడు ఖడ్గవర్మ.

''అయితే, మనం బండమీదినుంచి కిందికి దూకబోతున్నాం. నువ్వు బండ చుట్టూ పరిగెత్తుతూ, సాధ్యమైనన్ని ఎక్కువ తోడేళ్ళను నీ వెంట పడేలా ఆకర్షించు. నీ వెన్ను కాచి నేనూ పరిగెత్తుతూంటాను. తరవాత...''

జీవదత్తుడు మాట ముగించే లోపలే ఖడ్గవర్మ ''ఒరే, గురుభల్లూకా, ఇదే వస్తున్నాం! నువ్వూ, నీ వృకేశ్వరీదేవీ ప్రాణాలు నిలుపుకోవాలంటే బిలదుర్గం వదిలి పారిపొండి,'' అంటూ, కేకపెట్టి తోడేళ్ళబండమీంచికిందికి దూకాడు. అతడికి వెనగ్గా జీవదత్తుడు కూడా దూకాడు.



ఇద్దరు మనుషులు చచ్చిన తోడేలును భుజాన వేసుకుని, తమ మధ్యకు దూకి రావడంచూస్తూనే, ఆకలిమీద వున్న తోడేళ్ళు ఒక్కసారిగా గొంతులెత్తి అరిచి, ఖడ్గజీవదత్తులకేసి గుంపుగా పరిగెత్తినై. ఖడ్గవర్మ వాటికి అందకుండా ముందు వేగంగా పరిగెత్తుతూ, తోడేళ్ళబండ చుట్టూ తిరగసాగాడు. వెనక జీవదత్తుడు అందిన తోడేళ్ళను తన చేతగల మంత్రదండంతో ఎత్తి విసిరివేస్తూ, తానూ పరిగెత్తసాగాడు.

సొరంగద్వారం దగ్గర నిలబడి ఇదంతా చూస్తున్న గురుభల్లూకుడు పట్టలేని ఉత్సాహంతో పెద్దగా చప్పట్లు చరిచి, ''అంతా ఆ వృకేశ్వరీదేవి మాహాత్మ్యం! తన శత్రువులకు మతులుపోగొట్టి, తన వాహనాలైన తోడేళ్ళకు ఆహారంగా వేస్తున్నది!'' అంటూ భక్తిపారవశ్యంలో కళ్ళు మూసుకుని, మెల్లగా తల పైకెత్తాడు.




ఖడ్గజీవదత్తులకు, గురుభల్లూకుడి వాలకం మంచి అవకాశంలా కనిపించింది. జీవదత్తుడు, ''ఖడ్గా, ఇదే మంచి సమయం! ఆ భల్లూకుడు భక్తిమైకంలో వున్నాడు,'' అంటూ ఖడ్గవర్మను హెచ్చరించాడు.

ఖడ్గవర్మ మరుక్షణం తన భుజం మీద వున్న చచ్చిన తోడేలును, ఎడంచేత్తో పైకెత్తి, దాన్ని గురుభల్లూకుడున్న సొరంగద్వారం లోకి విసిరివేశాడు. తమ ఆహారం అలా ద్వారం కేసిపోవడం చూస్తూనే, బాగా ఆకలి గొన్న నాలుగైదు తోడేళ్ళు దానితోపాటుపైకెగిరి ద్వారంలోకి దూకినై.

కళ్ళు మూసుకుని ధ్యానంలోవున్న గురుభల్లూకుడి మీద చచ్చిన తోడేలూ, దాని మాంసం తినేందుకు, బతికివున్న నాలుగైదు తోడేళ్ళూ ఒకేసారి వచ్చిపడినై.

''హాc, వృకేశ్వరీ!'' అంటూ గురుభల్లూకుడు, తోడేళ్ళ తాకిడికి కిందపడి లేచే లోపల, వెనకవున్న వాడి శిష్యులు, ''తోడేళ్ళు! తోడేళ్ళు!'' అంటూ వెనుదిరిగి సొరంగ మార్గం వెంటపడి బిలం మధ్యకు పరిగెత్త సాగారు.

గురుభల్లూకుడు గజగజ వణికిపోతూ లేచి నిలబడ్డాడు. అల్లంత దూరంలో పడి వున్న చచ్చిన తోడేలు మీదికి కొన్ని తోడేళ్ళు వచ్చిపడి ఆవురావురుమంటూ తింటున్నవి. వాటి మధ్యకు పోయి తానూ తినాలని చూసి సాధ్యంకాక ఇవతలికి వచ్చిన బక్కతోడేలొకటి, కోరలు చాచి గుర్రుమంటూ, గురుభల్లూకుడి మీదికి దూకేందుకు సిద్ధపడుతున్నది.

అది చూసిన భల్లూకుడు, తన చేతిలోని శూలాన్నిపైకెత్తి,తోడేలుకు గురిచేసి, ''వృకేశ్వరి ప్రధాన పూజారినే తినాలని చూస్తున్నావా!'' అంటూ దాన్ని అదిలించి, ఒక్కొక్క అడుగే వెనక్కు వేస్తూ పోయి, సొరంగ మార్గాన పడి పారిపోసాగాడు.

ఇక్కడ సొరంగ ద్వారం కింద మిగిలిన తోడేళ్ళను దూరంగా అదిలించి కొడుతూ నిల బడివున్న ఖడ్గజీవదత్తులకు, లోపల ఏం జరుగుతున్నదో అర్థం కాలేదు.

''ఖడ్గా, ఇక మనం ఇక్కడ నిలబడి లాభం లేదు. గురుభల్లూకుడు బతికివున్నాడో, చచ్చి పోయాడో తెలియడంలేదుగాని, సొరంగంలో ప్రవేశించిన తోడేళ్ళు మాత్రం, ఆ దుర్మార్గు లందరినీ హడలగొట్టినై. బిలంలో చెలరేగిన కల్లోలపు ధ్వనులు, నీకు వినబడుతున్నవి గదా!'' అన్నాడు జీవదత్తుడు.

''వినబడకపోవడం ఏం? ఆ పిరికి వెధవ లంతా బిలం వదిలి, ఈ సరికి అరణ్యం కేసి పరిగెత్తుతున్నారని అనుమానం. గురుభల్లూ కుణ్ణిమాత్రం మనం ప్రాణాలతో వదల కూడదు,'' అన్నాడు ఖడ్గవర్మ.

''అయితే, ఇక్కడ కాలయాపన ఎందుకు? అందరం ఈ సొరంగ మార్గం గుండా బిలంలోకి జొరబడదాం. సమర బాహుణ్ణీ, అతడి అనుచరుణ్ణీ కేకవేసి, ఇక్కడికి రమ్మను,'' అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ పిలవగానే సమరబాహూ, అతడి అనుచరుడూ తోడేళ్ళబండ మీది నుంచి దిగి వాళ్ళ దగ్గరకు వచ్చారు. జీవదత్తుడు, వాళ్ళతో, ''సమరబాహూ! మనం ఈ పైనున్న ద్వారం గుండా బిలంలో ప్రవేశించబోతున్నాం,'' అన్నాడు.

సమరబాహు చుట్టూ ఒకసారి కలయ చూసి భయం భయంగా, ''మనం నలు గురం బిలంలో వున్న అంతమంది శత్రువుల్ని జయించగలమా? వెనుదిరిగి పారిపోయి, అరణ్యం చేరేందుకు మరెక్కడైనా మరొక మార్గం వున్నదేమో చూస్తే బావుంటుంది,'' అన్నా డు.

''భయపడకు, సమరబాహూ! ఇది తోడేళ్ళ బండ. ఇక్కడి నుంచి బయటపడాలంటే, బిలం లోంచి మాత్రమే మార్గమున్నది, అర్థ మైందికదా!'' అంటూ జీవదత్తుడు ఎగిరి సొరంగమార్గం మీదికెక్కాడు. అతడి వెనగ్గా ఖడ్గవర్మ కూడా అక్కడికి చేరాడు.

ఇంకా తెగని సంశయంతో, ఏమి చేయ టమా అని ఆలోచిస్తూ కింద నిలబడివున్న సమరబాహుణ్ణీ, అతడి అనుచరుణ్ణీ మీద పడి తినేందుకు; అక్కడ ఇంకా మిగిలివున్న తోడేళ్ళు కోరలు చాచి, ఒకటొకటిగా వాళ్ళను సమీపించసాగినై. -(ఇంకావుంది)



# 18. నిరీక్షిస్తూన్న దేవత!



''**పూ**రీ జగన్నాథ మందిరానికి ఉన్నట్టే, మనదేశంలోని ఇతర దేవాలయాలకు సంబంధించిన కథలకూడా ఉన్నాయా, తాతయ్యా?'' అని అడిగాడు సందీపుడు.

''ఉన్నాయి బాబూ! మనదేశంలోని ముఖ్యమైన దేవాలయాలకన్నిటికీ స్థల పురాణాలు ఉన్నాయి. అయితే, కన్యాకుమారి వంటి దేవాలయాలకు సంబంధించిన కథల వెనక ఉదాత్తసత్యాలు దాగి వున్నాయి .అందు వల్ల అవి మరీ ముఖ్యమైనవి!''అన్నాడు దేవనాథుడు.

''కన్యాకుమారి! మనదేశం దక్షిణాగ్రంలో ఉన్న పట్టణమేకదా? అక్కడికి మమ్మల్ని వినోదయాత్రకు తీసుకువెళతామని మా ఉపాధ్యాయులు చెప్పారు. ఆహా!అక్కడ దేవాలయం కూడా ఉందా?''అని అడిగాడు సందీపుడు ఆశ్చర్యంగా.

''దేవాలయంలోని దేవత పేరు మీదుగానే ఆ పట్టణానికి కన్యాకుమారి అనే పేరు వచ్చింది,'' అంటూ దేవనాథుడు కథ చెప్పడం ప్రారంభించాడు:

మనదేశం దక్షిణాగ్రంలో మూడు సముద్రాలు సంగమించే అందమైన ప్రాంతంలో కన్యాకుమారి క్షేత్రం ఉన్నది. అది ఒకానొకప్పుడు ఆ ప్రాంతాన్ని పాలించిన రాజులకు రాజధానిగా ఉండేది. ఆ సమయంలో ఆ రాజ్యంలో ఒక మారుమూల ప్రాంతంలో బాణాసురుడనే రాక్షసుడు ఉండేవాడు.

విశ్వావసు

వాడిలో మితిమించిన శక్తిసామర్థ్యాలు ఉండేవి గనక వాణ్ణి ఎవరూ అదుపుచేయలేక పోయారు. అహంకారం వాణ్ణి వినాశకర కృత్యాలకు పురి కొల్పింది. పరులను హింసించి ఆనందించ సాగాడు. ఇళ్ళనూ, భవనాలనూ కూల్చే వాడు. దేవాలయాలను నేలమట్టం చేసేవాడు. అడ్డు పడినవాళ్ళను నిర్దాక్షిణ్యంగా హతమార్చేవాడు వాడికి మంచి చెప్పడానికి ప్రయత్నించిన కొందరు మునులకూ, సాధువులకూ కూడా అదేగతి ప్రాప్తించింది.

రోజురోజుకూ వాడి దురాగతాలు భరించ లేనంతగా మితిమించిపోవడంతో మునులు దీనిని గురించి తీవ్రంగా ఆలోచించారు. అసు రుణ్ణి హతమార్చి తమను కాపాడమని జగన్మా తను ధ్యానించి ప్రార్థించారు. ఆ లోక కంట కుడి పీడ అచిరకాలంలోనే విరగడ చేస్తానని జగ న్మాత మునులకు అభయమిచ్చింది.

ఆ రాజుకు ఒక అందమైన ఆడశిశువు జన్మించింది. శిశువు దివ్యమోహనరూపాన్ని చూసి, ఆమె జగన్మాత అవతారమని కొందరు మునులు అప్పుడే గ్రహించారు. ఆమె శుక్ల పక్ష చంద్రుడిలా రోజుకొక వింత కళతో పెరిగి యౌవనవతి అయింది. విద్యలోనూ, గుర్రపు స్వారీ, కత్తియుద్ధం మొదలైన క్షాత్ర విద్యల లోనూ సాటిలేని మేటిగా ఆమె పేరుగాంచింది. అంతేకాదు, పెద్దలపట్ల గౌరవం, సామాన్య ప్రజలపట్ల ఆదరం, బంధుమిత్రులపట్ల ప్రేమానురాగాలూ కనబరచేది. అద్భుతమైన ఆమెఅందచందాలనూ, అపూర్వమైన గుణగణా లను కీర్తిస్తూ కవులూ, గాయకులూ పద్యా లుగా, పాటలుగా ఆలపించేవారు. తమ యువరాణి శౌర్య పరాక్రమాలను గురించి ప్రజలు వింత వింతలుగా చెప్పుకునేవారు.



యువరాణి అందచందాలను గురించి విన్న బాణాసురుడు, ఆమెను పెళ్ళాడాలను కున్నాడు. ఆ సంగతిని దూతద్వారా రాజుకు తెలియజేశాడు. రాక్షసుడి కోరిక తెలియగానే రాజు హడలిపోయాడు. ఆ దుర్మార్గుడు వచ్చే లోగా, తన కుమార్తెను యోగ్యుడైన వరుడి కిచ్చి వివాహం జరిపించాలని నిర్ణయించాడు.

యువరాణికి ఆ సంగతి తెలిసింది. ఆమెకు తాను ఎవరైనదీ స్ఫురణకు వచ్చింది. ఆమె పరాశక్తి అవతారం; పరమశివుణ్ణి తప్ప వేరొకరిని వివాహమాడే ప్రసక్తేలేదు. వెంటనే పెళ్ళి ఏర్పాట్లు ప్రారంభించమనీ, ముహూర్త సమయానికి వరుడు రాగలడనీ తండ్రికి తెలియ జేసింది.

తన కుమార్తె మామూలు యువతి కాదని అప్పటికే గ్రహించిన రాజు, ఆమె మాటలను నమ్మాడు. వివాహానికి శుభ ముహూర్తం నిశ్చయించబడింది. ఆ విషయం



కుమార్తెకు చెప్పాడు. ఆమె కళ్ళు మూసుకుని కూర్చుని శివధ్యానంలో నిమగ్నమయింది.

కైలాసగిరి మీది పరమశివుడు కళ్ళు తెరిచాడు. హృదయం పరవశం చెందడంతో ఆయన వెండి కొండ దిగి దక్షిణాగ్రంకేసిపయన మయ్యాడు. పరమశివుడువచ్చియువరాణినివివాహమాడినట్టయితే, ఆమెఆయనవెంటకైలాసానికి తరలి వెళ్ళిపోతుంది. ఆ తరవాత దుష్ట రాక్షసుణ్ణి దునుమాడేదెవ్వరు? అన్నఆలోచనతో మునులు విచారగ్రస్తులయ్యారు. వాళ్ళ విచారం సరైనదే అని భావించిన నారదుడు - అప్పుడు అర్ధరాత్రే అయినప్పటికీ కోడి కూసేలా చేశాడు. పరధ్యానంగా నడుస్తూ, కోడికూత విన్నపరమశివుడు, ''ఆహా! తెల్లవారిపోయింది. ముహూర్త సమయందాటిపోయింది కదా,'' అని నిట్టూర్పుతో ఒక బండపై కూర్చున్నాడు. మరుక్షణమే యథాప్రకారం నిశ్చలమైన తపస్సులో నిమగ్నుడై పోయాడు.

ఇక్కడ రాజభవనం పెళ్ళిసందడితో కోలాహలంగా ఉంది. తమయువరాణిని వివాహమాడడానికి రానున్న వరుడు ఎవరా అని ప్రజలు ఆతృతగా ఎదురుచూడసాగారు. అప్పుడక్కడికి భీకరాకారంతో బాణాసురుడు వచ్చాడు. ''రాకుమారిని నాకుగాక, మరెవ్వరికో కట్టబెట్టడానికి మీకెన్ని గుండెలు?'' అని గద్దిస్తూ, కాపలాభటులు వారిస్తున్నా వినకుండా వికటాట్టహాసంచేస్తూ, భూమి దద్దరిల్లేవిధంగా రాజభవనంలోకి ప్రవేశించాడు.

అక్కడ యువరాణిని వధువులా అలంకరించి ముత్తయిదువలునలుగుపెడుతున్నారు. వెలుపల హాహాకారాలు వినిపించడంతో యువరాణి తలెత్తి చూసింది. చేతిలో పెద్ద కత్తితో, పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ, అడ్డు వచ్చిన జనాన్ని నరుకుతూ, వస్తువులను తన్ని తోస్తూ రాక్షసుడు వస్తున్నాడు.

రాకుమారి లేచి గంభీరంగా నాలుగడుగులు ముందుకు వేసినిలబడింది. ఆమె జగన్మోహన సౌందర్యాన్నిచూసి రాక్షసుడు ఒక్క క్షణం అలాగే నిలబడిపోయాడు. ''ఇక్కడినుంచి వెళ్ళిపో!'' అని రాకుమారి ఆజ్ఞాపించింది.

''ఆహాహా! తిరిగి వెళ్ళిపోవడానికా ఇంత దూరంవచ్చానుసుందరీ!'' అంటూ రాక్షసుడు పకపకానవ్వుతూ ఆమెమీదికి ఉరికాడు. యువరాణి వాడి పట్టునుంచి తప్పించుకుని, వాణ్ణి బలంగా పట్టితోసింది. వెల్లకిలాపడ్డ రాక్షసుడు క్షణంలో తేరుకుని, లేచి ఆమె పైకి మళ్ళీఉరకబోయాడు.

అంతలో రాకుమారి, పక్కన నిలబడ్డ అంగరక్షకుడి నుంచి ఖడ్గాన్ని అందుకుని రాక్షసుడితో కొంతసేపు యుద్ధం చేసి, ఆఖరికి వాడి తలను తెగనరికింది!

పరాశక్తి భూలోకంలో అవతరించిన కార్యం పూర్తయింది. రాక్షసుడి పీడ విరగడ యిందని అందరూ సంతోషించారు. అయితే, తమ యువరాణిని పెళ్ళాడడానికి వస్తాడను కున్న వరుడు శుభఘడియలు దాటిపోయినా రాకపోయేసరికి ప్రజలువిచారగ్రస్తులయ్యారు. వివాహానికని తయారుచేసిన పిండివంటలు ఇసుకగా, గులకరాళ్ళుగా మారిపోయాయి. పరాశక్తి అవతారం శిలావిగ్రహంగా మారిపో యింది. విశ్వాసానికి సంకేతమైన తూర్పు దిశ కేసి చూస్తూ తపోభంగిమలో నాటినుంచి కన్యా కుమారిగా దర్శనమిస్తోంది!

''అద్భుతమైన కథ!'' అన్నారు పిల్లలు చాలా ఆనందంతో.

''కథమాత్రమేకాదు; అది అందిస్తూన్న సందేశం కూడా అద్భుతమే!'' అన్నాడు దేవ నాథుడు.

'' ఏమిటా సందేశం, తాతయ్యా?'' అని అడిగాడు సందీపుడు.

''దక్షిణాగ్రంలో నిలబడి దేవత యావద్దే శాన్ని రక్షిస్తోంది. యువరాణిని చేపట్టలేని రాక్షసుడిలాగే,మనదేశాన్ని ఏ శత్రువూ కబ ళించలేడు. అయినా,ఇది మన విశ్వాసానికి సంబంధించిన విషయం. ఈ కథలో మరొక ముఖ్యమైన సూక్ష్మ సందేశం కూడా ఇమిడి ఉన్నది!'' అన్నాడు దేవనాథుడు.

'' ఏమిటది?'' అని అడిగింది శ్యామల ఉత్సాహంగా.

''శ్రీఅరవిందులు మహాయోగి కాక పూర్వం, అంటే - ఆయన స్వాతంత్ర్యోద్యమం నడుపు తూన్నకాలంలోనే జాతికి ఒకసందేశం ఇచ్చారు. భారతభూమి కేవలం ఒక భూభాగం మాత్రమే కాదు; అదొక దివ్యధాత్రి! మహా చైతన్య భౌతికరూపమే భారతభూమి - అని అన్నారు.దివ్య చైతన్య శిఖరాగ్రంలో పరమే శ్వరుడు! పాదతలంలో నిలబడి పరాశక్తి - పరమేశ్వరుడు పైనుంచి దిగిరావాలని తపస్సు చేస్తోంది! ఇరువురూ ఏకమైతే పరిపూర్ణ చైతన్య శుభ పరిణామం వెల్లివిరుస్తుంది. భారతావని మునుముందు ఆధ్యాత్మిక చైతన్య భూమిగా పరిణమిస్తుందన్న ఆశాపూరిత సందేశాన్ని కన్యాకుమారి నిరీక్షణ మనకందిస్తున్నది!'' అని ముగించాడు దేవనాథుడు.

''కృతజ్ఞతలు తాతయ్యా! విశ్వాసం కలి గించే చక్కటి కథ చెప్పారు!'' అన్నారు పిల్లలు సంతోషంగా.

– (ఇంకావుంది)





# అమోఘ వాక్కు

నిరంజనవరంలో, సుధాముడు అనే మధ్య తరగతి రైతు కుటుంబీకుడు వుండేవాడు. తనకున్న రెండెకరాల భూమిలో స్వంతంగా వ్యవసాయం చేసుకుంటూ, తన భార్యా బిడ్డలతో తృప్తిగా జీవిస్తున్నాడు.

అదే గ్రామంలో చలమయ్య అనే ధన వంతుడున్నాడు. అతడు అవసరంలోవున్న వారికి అధిక వడ్డీలకు అప్పులిచ్చి, ఏదో ఒక వంకతో వారికున్న ఆస్తుల్ని కాజేసేవాడు. సుధాముడి తండ్రి, ఏనాడో చలమయ్య వద్ద అప్పుచేసి, తన జీవితకాలంలో తీర్చలేక పోయాడు. సుధాముడు కూడా చలమయ్య బాకీ తీర్చలేక, ప్రతిఏడూ పంటచేతికిరాగానే వడ్డీకిగాను గింజలు కొలిచేవాడు.

సంవత్సరాంతమూ కష్టపడి పండించిన ధాన్యం ఇల్లుచేరకుండానే, చలమయ్య మను షులు యమదూతల్లాగా కల్లంలోకి వచ్చి నిలబడేవారు. సుధాముడు తన అక్కసును, ఆవేదనను దాచుకుని, మారుమాట్లాడకుండా ధాన్యం కొలిచేవాడు.

ఒకసారి చలమయ్య తాలూకూ పశువుల కాపరి ఏమరుపాటువల్ల, నాలుగైదు పశు వులు సుధాముడి పొలంలో పడి పంటను నాశనం చేశాయి. జరిగింది గ్రామాధికారి దృష్టికి తీసుకుపోయి, తగిన నష్టపరిహారం పొందమని, సుధాముడికి ఇరుగుపొరుగు సలహా ఇచ్చారు. అయినా అతడు వినిపించు కోలేదు. నష్టం కలిగించింది చలమయ్య పశువులే కాబట్టి, సంగతి గుర్తించి, చల మయ్య ఆ సంవత్సరం ధాన్యం కొలవమని అడగకపోవచ్చని అతడి ఉద్దేశ్యం.

కానీ కోతలు పూర్తయ్యే సమయానికి, చల మయ్య మనుషులు వడ్డీ ధాన్యం కోసం వచ్చారు. సుధాముడు వాళ్ళతో, "అయ్యా! ఈ సంవత్సరం దిగుబడి సగానికి సగం తగ్గింది. ఈ ధాన్యం మా కుటుంబం తిన

దాసరి వెంకటరమణ

డానికి మాత్రమే సరిపోతుంది. వచ్చే సంవత్సరం నుంచి మామూలుగా ధాన్యం కొలుస్తాను, కాబట్టి, ఈ సంవత్సరానికి ఎలాగైనా కనికరించమని, చలమయ్యకు మనవి చెయ్యండి!'' అన్నాడు.

ఆ వార్త విన్న చలమయ్య స్వయంగా అక్కడికి వచ్చి, ధాన్యం కొలవాల్సిందే అని మొండిపట్టు పట్టాడు. సుధాముడు, ఎంత ప్రాధేయపడినా,అతడు వినలేదు. దీనితో సుధాముడిలో సహనం చచ్చిపోయింది.

అతడు పట్టరాని ఆగ్రహంతో, ''ఇప్పటి నా దీనస్థితికి కారణం, నీ పశువులే! అవి నా పంటను నాశనం చేయకుండా వుండివుంటే, ఈనాడు నీకు ధాన్యం కొలిచివుండేవాడిని. జరిగిన దానికి నువ్వు కారణం అయ్యుండీ, రవ్వంత మానవత్వం కూడా లేకుండా పశువులా ప్రవర్తిస్తున్నావు,'' అన్నాడు.

సుధాముడి మొండి ధైర్యానికి చలమయ్య ఒక క్షణం విస్తుపోయాడు. ఆ తరవాత తేరుకుని, అతణ్ణి చెట్టుకు కట్టేయించి, కొరడా తెప్పించి ఆవేశంతో కొట్టసాగాడు. అడ్డం వచ్చిన సుధాముడి భార్యాపిల్లలను కూడా కొరడాతో కొట్టాడు.

అక్కడ పోగయిన జనంలో ఒక్కరూ చలమయ్యను అడ్డుకోలేకపోయారు. వాళ్ళందరూ కూడా అంతో ఇంతో చలమయ్యకు అప్పున్నవాళ్ళే! చివరకు చలమయ్య అలసిపోయి, కొరడాను దూరంగా విసిరివేసి, ''ఒరే, సుధామా! నీ ఇల్లూ, పొలమూ మొత్తం స్వాధీనం చేసుకున్నా, నా అప్పులో సగమే చెల్లు అవుతుంది. మిగతా సగం అప్పు ఎలా తీరుస్తావో తీర్చు. రేపు ఉదయం వరకూ నీకు గడువిస్తున్నాను!'' అంటూ అక్కడి నుంచి బయలు దేరాడు.

సుధాముడు అతి కష్టంమీద శక్తిని కూడదీసుకుని, ''ఒరేయ్, ఆగరా!'' అన్నాడు.

చలమయ్య ఆగి, తనను ఒరే అన్న అతడి ధైర్యానికి ఆశ్చర్యంగా చూశాడు.





సుధాముడు రెండు చేతులూ జోడించి, ఒకసారి తల ఎత్తి ఆకాశం కేసి చూసి, "మని షికి వినాశకాలంలో విపరీత బుద్ధి పుడుతుం దన్నారు. నీకు కాలం సమీపించడంవల్లే, ఇలా మిడిసిపడుతున్నావు. నేనే గనక నిజా యితీపరుణ్ణీ, నీతివంతుణ్ణీ అయితే- తెల్ల వారేలోగా నువ్వు సర్వనాశనమై పోతావు. ఇందుకు, నట్టనడిమి ఆకాశంలో వెలుగు తున్న,ఆ సూర్యభగవానుడే సాక్షి!" అన్నాడు.

ఆ రాత్రి అకస్మాత్తుగా మబ్బు పట్టి కుండ పోతగా వానకురిసింది. ఆ సమయంలో ఫెళ ఫెళారావాలతో ఆకాశందద్దరిల్లి, చలమయ్య ఇంటి మీద పిడుగు పడింది. ఇల్లు నేలమట్ట మయింది. ఎవరూ ప్రాణాలతో బయట పడలేదు.

సరిగ్గా అదే సమయంలో, నారద మహర్షి అదృశ్యరూపంలో భూలోకసంచారం ముగిం చుకుని సత్యలోకం వెళుతూ, ఆ పగలు సుధాముడి పొలం దగ్గరా, రాత్రి ఊళ్ళోనూ జరిగినదంతా ఆసక్తికరంగా గమనించాడు. ఒకసామాన్యుడి మాటకు అంతశక్తి వుండడం చూసి ఆశ్చర్యపోయాడు.

ఆయన సత్యలోకం చేరగానే బ్రహ్మదేవు డితో, "తండ్రీ, ఏమిటీ విడ్డూరం!" అంటూ, తను భూలోకంలో చూసినదంతా చెప్పి, "చలమయ్య మరణం కాకతాళీయమా లేక సుధాముడి వాక్కు ఫలితమా? అలా అయితే, ఒక సాధారణ మానవుడి వాక్కుకు, అంతటి శక్తి ఎలా వచ్చింది?" అని అడిగాడు.

బ్రహ్మ చిరునవ్వు నవ్వి, "నారదా! సుధా ముడు సామాన్య వ్యక్తికాదు. గొప్ప సత్యశీలి, ధర్మజీవి, నిస్వార్థపరుడు. ఆ కారణంగా అత డిది అమోఘవాక్కు! నీకు జరిగింది అర్థం కావాలంటే..అటు చూడు!" అని భూలోకం లోని ఒక ప్రాంతాన్ని చూపించాడు.

ఒకఅడవి మార్గాన బోధకుడు అనేసన్యాసి వెళుతున్నాడు. మార్గానికి పక్కగావున్న పొద లలో కాలద్రష్టుడనే నాగుడు తీవ్రమైన గాయా లతో విపరీతంగా బాధపడుతున్నాడు. అతడు సుబోధకుడిని చూడగానే, అతి కష్టం మీద పొదలనుంచి బయటికి వచ్చి, "స్వామీ, నన్ను గుర్తించారా?" అని అడిగాడు.

సుబోధకుడు, నాగుణ్ణి చూసి, "అయ్యో! కాలద్రష్టా ఏమిటీ దుస్థితి?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

"ఏమని చెప్పమంటారు, స్వామీ! అంతా ఆనాడు మీరు చెప్పినట్లే నడుచుకున్నాను. ఇటు వచ్చే మనుషుల్ని కాటువేయడంమాని, బుస మాత్రం కొట్టి బెదిరించడం ప్రారంభిం

చాను. అలా కొద్దికాలం జరిగాక, వాళ్ళు నా కోరలు పోయాయనీ, విషంలేదనీ భ్రమ పడి, నన్ను అకారణంగా నానా హింసలపాలు చేస్తున్నారు. ఇప్పుడు నన్నేంచేయమనేదీ, తమరే శెలవివ్వాలి,'' అంటూ, కాలద్రష్టుడు ప్రాథేయపడ్డాడు.

అంతా విన్న సుబోధకుడు దీర్ఘంగా నిట్టూర్చి, ''నీకు జరిగిన బాధాకరమైన అనుభవంలాంటిది,గతంలో చాలా మందికి జరిగింది. ఇందుకు ప్రధాన కారణం, నీ లాంటి ధర్మబుద్ధులు, అధిక సంఖ్యాకులైన మనుషుల్లోవుండే హింసాప్రవృత్తిని, సరిగ్గా అంచనా వేయలేకపోవడం. ఇదిగో, కాల ద్రష్టా! నీ శరీర బాధలన్నిటికీ ఉపశమనం కలిగిస్తున్నాను,'' అంటూ వాడి శరీరాన్ని చేతితో దువ్వి, ''ధర్మబద్ధమైన జీవితం గడిపే ప్రతి జీవీ నిప్పులాంటిదే. నిప్పును తాకితే కాలుతుందన్న పరమ సత్యాన్ని, మూఢులకు చేతలద్వారా చెప్పవలసి వుంటుంది, అర్థ మైంది గదా!'' అంటూ సుబోధకుడు అక్కడి నుంచి కదిలాడు.

ఒక పావుగంట గడిచేలోగా అక్కడికి ఇద్దరు మనుషులు వచ్చారు.వాళ్ళల్లో ఒకడి చేతిలో పొడవాటి కర్ర వున్నది; రెండవవాడి చేతిలో పాములను పట్టి బంధించే గుండ్రటి బుట్ట వున్నది.

చేతిలో కర్ర వున్నవాడు, కాలద్రష్టుడున్న పొదలోకి చూస్తూ, ''ఇక్కడే, విషపు కోరలు ఊడిపోయిన పామున్నది. నేను పొదనుంచి దాన్ని బయటికి తరుముతాను. నువ్వు నిర్భయంగా దాని మెడ పట్టుకుని బుట్టలో పెట్టెయ్యి,'' అంటూపొదమీద కర్రతో కొట్టాడు.

ఆ మరుక్షణం, కాలద్రష్టుడు పొదలోంచి బయటికి వచ్చి, బుస్సుమంటూ వాడి కంఠం మీద కసిగా కాటువేసి, సర్రుమంటూ రెండో వాడికేసి దూకాడు. ఆ వెంటనే ఇద్దరూ చావు కేకలు పెడుతూ, ముళ్ళ పొదలకు అడ్డం పడి పరిగెత్తసాగారు.

ఇది చూసిన నారదుడికి, ధర్మానుసారం జీవించే ప్రతి జీవీ నిప్పుతో సమానమన్న ధర్మసూక్ష్మం బోధపడింది. ఆయన బ్రహ్మ దేవుడికి కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.



# బోయవాడి కుక్క

అడవిపక్షుల్నీ, నీటిపక్షుల్నీ వేటాడి జీవించే ఒక బోయవాడికి, వాటిని చెట్లలోనుంచీ, నీటిలోనుంచీ తన దగ్గరకు తీసుకురాగల కుక్క ఒకటి అవసరం అనిపించింది. వాడు సంతకు పోయి, అప్పుడప్పుడే ఈడుకు వస్తున్న ఒక కుక్కను కొన్నాడు.

వాడు ఇంటికి తిరిగి వస్తూ, కుక్క శక్తి ఏపాటిదో పరీక్షించేందుకు, అప్పుడే ఎగిరివచ్చి, ఒక సరస్సులో ఈదుతున్న అడవి బాతుల గుంపుమీద బాణం వదిలాడు. బాణం దెబ్బతిన్న ఒక బాతు ఎగిరిపోలేక నీళ్ళలో అటూ ఇటూ కొట్టుకోసాగింది. మిగతా బాతులన్నీ గుంపుగా ఎగిరిపోయినై.

బోయవాడు, తను కొన్న కుక్కను నీటిలో పడివున్న బాతుకేసి ఉసికొల్పాడు. అది నీటిమీద నడుస్తూ పోయి, బాతును పట్టుకుని వాడిదగ్గరకు తీసుకువచ్చింది. ఇది చూసి బోయవాడు నిర్ఘాంతపడిపోయాడు. ఈ సంగతి ఎవరికైనా చెబితే, వాళ్ళు నమ్మకపోగా తనను మతి చెడినవాడికింద జమకడతారని వాడికి అనిపించింది.

అందుకని వాడు, మరునాడు తను ఎరిగిన ఇద్దరు బోయవాళ్ళను వెంటబెట్టుకు పోయి, అంతకు ముందు రోజులాగే, ఒక పెద్ద చెరువులో వాలిన అడవిబాతులమీద బాణంవదిలాడు. దెబ్బతిన్న బాతు తప్ప మిగతావి ఎగిరిపోయినై. బోయవాడు ఉసికొల్పగా కుక్క నీటిమీద నడుస్తూ పోయి, బాతు మెడ పట్టుకుని యజమాని దగ్గరకు తెచ్చింది.

ఇది చూసిన బోయవాడి స్నేహితులు, ''ఛీ,ఛీ! సంతలో నిన్నెవడో నిలువునా మోసగించాడు. ఈ కుక్కకు ఈదటం చేతకాదు!'' అన్నారు.





# కృష్ణభూపతి కథ

పూర్వం మందాకినీ నదీతీరంలో, మలయ ద్వీపం అనే దేశం ఒకటి ఉండేది. గోపాల భూపతి అనే రాజు ఆ దేశాన్ని పాలిస్తూండే వాడు. ఆయన ఏకైక కుమారుడు కృష్ణ భూపతి. అతడు పదిహేనేళ్ళ వయసువాడై వుండగా, గోపాలభూపతి మరణించాడు. రాజపీఠానికి వారసుడైన ఒక్కగా నొక్క బిడ్డ, ఇంకా రాజ్యపాలనా వ్యవహారాల్లో ఆరితేరక ముందే తండ్రిని పోగొట్టుకోవడంతో, మహారాణి సునందాదేవి ఆక్రోశానికిఅంతులేకుండా పోయింది.ఆ విషాద ఘడియల్లోమహారాణికి అండగా నిలిచినవాడు, చందన వర్మ.

సునందాదేవికి స్వయానా అన్న అయిన చందనవర్మ మలయ ద్వీపానికి రెండు దేశాల అవతలవున్న కుశద్వీపపురాజు. బావగారి మరణవార్త తెలియగానే ఉన్న పాటున బైలు దేరి వచ్చిన చందనవర్మ, చెల్లెలి బాధను చూసి ఆమెను వదిలి తన దారిన తాను వెళ్ళలేక పోయాడు. తనకు అత్యంత సన్నిహితుడూ, రాజకుటుంబంలో ఒకడూ అయిన మాల్య వంతుణ్ణి, కుశద్వీపంలో తన ప్రతినిధిగా నియమించి,భార్యాబిడ్డలతో మలయద్వీపం లోనే వుండిపోయాడు.

ఒక శుభముహూర్తాన చందనవర్మ, తన మేనల్లుడు కృష్ణభూపతికి మహారాజ పట్టాభి షేకం చేసి, అతడి పేర తాను పాలన సాగిస్తూ, అతడికి తానే గురువై రాజనీతికి సంబంధించిన సమస్తమూ నేర్పాడు. అంతేకాక, పండి

లక్ష్మి గాయత్రి



ఇన్నాళ్ళ తర్వాత తిరిగివచ్చిన రాజకుటుంబా
నికి అరదండాలతో స్వాగతం పలికాడు.
నమ్మినవాడి నమ్మకద్రోహాన్ని నిబ్బరంగా
తట్టుకోలేక, ఉన్నపాటున కుప్పకూలి గుండె
ఆగి మరణించాడు చందనవర్మ. నమ్మకస్థు
డైన ఒక భటుడు, ఆపద్బాంధవుడిలా చేసిన
సహాయంతో, కుమార్తెను వెంటబెట్టుకుని
పుట్టెడు దిగులుతో, తిరిగి మలయద్వీపానికి
చేరింది అతడి రాణి.

తన కుటుంబాన్ని ఒడ్డుకు చేర్చిన అన్నకూ,
అతడి కుటుంబానికీ వాటిల్లిన ఆపద చూసి
ఎంతో వ్యథచెందిన సునందాదేవి వదినగారినీ,
మేనగోడలినీ ఎంతగానో ఆదరించింది.

ఆనాటి రాత్రి, తల్లి ఒకసారి వచ్చి వెళ్ళమని
పంపిన కబురు అందుకుని, కృష్ణభూపతి
రాజమాత అంతఃపురానికి వెళ్ళాడు. గంభీర
వదనంతోవున్న సునందాదేవి, కొడుకును
కూర్చోమని సైగచేసి, సూటిగా అసలు విష
యాన్ని ప్రారంభించింది.

"కృష్ణా! ఇన్ని సంవత్సరాల జీవితంలో
నేను ప్రత్యేకంగా ఎవరినీ, ఏ కోరికలూ కోర
లేదు. ఇప్పుడు నిన్ను రెండు కోరికలు కోరుదా
మని పిలిచాను! చెప్పు, కోరమంటావా?"
అని ప్రశ్నించింది.

తల్లి మాటలకు కృష్ణభూపతి చిరునవ్వు
నవ్వుతూ, "నేను తీరుస్తానో తీర్చనో అన్న
సందేహం ఏమాత్రం వున్నా, నన్ను అసలు
పిలిచివుండేదానివే కాదు. నిస్సంకోచంగా
కోరుకో అమ్మా," అన్నాడు.

"నాయనా, నువ్వేదో చిరునవ్వు నవ్వు
తున్నావు. అంటే, నా మనసులోవున్న కోరిక
లేమిటో, నువ్వు ఊహించి వుండాలి.

తులూ, యుద్ధకళాకోవిదులూ అయిన వారి
చేత, ఆయా విషయాల్లో చక్కని విద్యాబోధ
చేయించాడు. స్వతహాగా మేధావంతుడైన
కృష్ణభూపతి నాలుగైదేళ్ళు గడిచేలోపల
శస్త్రశాస్త్రాల్లో దిట్ట అనిపించుకోవడమేకాక,
రసమయమైన కవిత్వాన్ని ఆశువుగా చెప్పగల
పరిపూర్ణత్వాన్నికూడా సాధించగలిగాడు.

తన మేనల్లుడు స్వయంగా రాజ్యపాలన
చేయగలడన్న గట్టి నమ్మకం కలగగానే చందన
వర్మ, కృష్ణభూపతికి మొత్తం పాలనావ్యవహా
రాలన్నీ అప్పచెప్పి, స్వదేశానికి తిరుగు
ప్రయాణమయ్యాడు.

స్వదేశం చేరిన చందనవర్మకు ఊహించని
విధంగా పిడుగులాంటి సంఘటన ఎదు
రైంది. చందనవర్మలేని ఈ నాలుగైదు సంవత్స
రాల్లోనూ, రాజవైభోగాలకూ, మితిమీరిన
కీర్తికాంక్షకూలొంగిపోయిన మాల్యవంతుడు,

అవునా?'' అంటూ ప్రశ్నించింది, సునందా దేవి.

అందుకు కృష్ణభూపతి, ''నీ కోరికలు రెండూ ఏమైవుంటాయో, నేను ఊహించగలి గినమాట నిజమే! అంతే, చెప్పు!'' అన్నాడు.

''సరే, విను! నా మొదటి కోరిక, నీ మామ పట్ల అంతటి నమ్మక ద్రోహానికి పాల్పడి, అతడి చావుకు కారకుడైన మాల్యవంతుడు సాధ్యమై నంత త్వరలో చచ్చితీరాలి. ఈ ప్రయత్నంలో నువ్వు వీరస్వర్గాన్ని అలంకరించినా, నాకు ఆనందమే. ఇకరెండవ కోరిక; నా మేనకోడలు జ్యోత్స్నాదేవి, నీకు పట్టపురాణి కావాలి. తన కూతుర్ని నీకిచ్చి వివాహం చెయ్యాలని, మా అన్నయ్య ఎంతగానో ఆశపడిన విషయం, నాకు తెలుసు!'' అంటూ కన్నీళ్ళు తుడుచు కున్నది.

కృష్ణభూపతి మృదువుగా, ''నువ్వు అంత వేదన చెందవలసిన అవసరంలేదమ్మా! నువ్వు కోరిన ప్రకారమే జ్యోత్స్న ఈ దేశానికి మహా రాణి అవుతుంది. ఇక మాల్యవంతుణ్ణి సంహ రించడమంటావా, అది నాకు చిటికెలోపని! ఈ విషయాన్ని అప్పుడే మహామంత్రితోనూ, సేనాధిపతితోనూ చర్చించడం కూడా జరి గింది. కుశద్వీపం ఒక్కటే కాదు, మనకూ కుశద్వీపానికీ నడుమగల చామర, కల్హార ద్వీపాలు రెండూ కూడా, మన సేనల జైత్ర యాత్రకు గురికాబోతున్నాయి. ఆ రెండు ద్వీపాల అధిపతులూ--ఒకరు మూర్ఖత్వం తోనూ, మరొకరు మితిమీరిన భోగలాలసత్వం తోనూ ప్రజాక్షేమాన్ని పట్టించుకోవడంలేదన్న వార్తలు నానాటికీ ముమ్మరమవుతున్నాయి. అందుచేత, వరుసగా ఆ మూడు ద్వీపాల



మీదికీ దండెత్తి వెళ్ళాలని, కొన్నాళ్ళుగా ఆలో చిస్తున్నాం. బహుశా ఈ బహుళ పంచమి నాటికే, మా జైత్రయాత్ర నిశ్చయం కావచ్చు!'' అన్నాడు.

కొడుకు మాటలకు రాజమాత ఎంతో ఆనందపడుతూ, ''విజయీభవ! విజయ లక్ష్మిని వెంటబెట్టుకురా, నాయనా!'' అన్నది.

కృష్ణభూపతి చెప్పినట్టే, బహుళ పంచమి నాటి సూర్యోదయానికి పూర్వమే, మలయ ద్వీపసేనావాహిని జైత్రయాత్రకు కదిలింది. సుశిక్షితులైన సైనికుల వీరవిహారం చామర, కల్హారద్వీప ప్రభులను ఇట్టే ఓడించి కృష్ణ భూపతికి పాదాక్రాంతం చేశాయి. ఆ రెండు దేశాలనూ జయించిన విజయోత్సాహంతో సైన్యం కుశద్వీపపు దిశగా ప్రయాణం సాగిం చింది. ఒకపగలంతా ప్రయాణంచేశాక, వారికి బాగా దట్టంగావున్న చిట్టడవి తగిలింది. రాజు



ఆజ్ఞానుసారం అడవి అంచున ఆగి,విడిదికి గుడారం సిద్ధం చేశారు. బాగా అలసివున్న కృష్ణభూపతి గుడారంలోకి ప్రవేశించి,అక్కడ అమర్చిన శయ్యమీద పడుకున్నాడు.

ఒక గంట గడిచీ గడవకుండానే గుడారం బైట ఏదో కలకలం విన్న కృష్ణభూపతి, చప్పున లేచి కూర్చుంటూ, ''ఏమిటది?'' అంటూ ప్రశ్నించాడు.

రాజు ప్రశ్నకు, గుడారపుద్వారం వద్ద కాపలా వున్న భటుడు రెండడుగులు లోప లికి వేసి, ''ఎవరో కుర్రవాడు,ప్రభూ!ఇంకా మీసాలైనా సరిగ్గా రాలేదు, మన సైన్యంలో చేరుతాడట!మీ దర్శనం వెంటనే కావాలంటూ గొడవ చేస్తున్నాడు. అతడు శత్రుగూఢచారి కావచ్చునన్న అనుమానంతో మన సైనికులు అడుగు ముందుకు వెయ్యకుండా ఆపారు,'' అంటూ జవాబిచ్చాడు.

కృష్ణభూపతి వెంటనే లేచి గుడారం వెలుపలికి వచ్చి చూశాడు. సైనికుల ముందు నిలబడివున్న కుర్రవాడు నిజంగానే చాలా లేత వయస్కుడు. సైనికుల చేతి కాగడాల వెలుతురులో, కుర్రవాడి ముఖంలోని లాలిత్యం, నిప్పుకణికల మధ్య సువర్ణంలా కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నది. సైనికులు చేసిన గొడవకు,అతడి విశాలనేత్రాలు,కొలను లోని చేపపిల్లల్లా అటూ ఇటూ కదులుతూ, అతృతను కనబరుస్తున్నాయి.

నిర్భయంగా తనవైపు చూస్తున్న,ఆ నవ యువకుడి ముఖంలో లాలిత్యపు తెరచాటున కనబడుతున్న పట్టుదల, శౌర్యం కృష్ణభూప తిని ఆకర్షించాయి. అతడు ఒక్క నిమిషం కుర్రవాణ్ణి తేరిపార చూసి, ''అతణ్ణి లోపలికి పంపించండి!'' అంటూ భటులను ఆదే శించి,వెనుదిరిగి గుడారంలోకి నడిచాడు.

మరొక నిమిషంలో లోపలికి ప్రవేశించిన కుర్రవాడు, కృష్ణభూపతికి వంగి నమస్క రించి, ''ఇంతలో మీ దర్శనం అవుతుందను కోలేదు, చాలా కృతజ్ఞుణ్ణి ప్రభూ!'' అన్నాడు.

సౌకుమార్యం వీడని అతడి కంఠ మాధు ర్యానికి రాజు తల పంకిస్తూ, ''ఇంతకూ ఎవరు నువ్వు? ఏ దేశస్థుడివి? మా సైన్యంలో చేరాలనుకోవడానికి కారణం ఏమిటి?'' అంటూ ప్రశ్నించాడు.

''ప్రభూ! నా పేరు కళాపూర్ణుడు. నేను ఏ దేశస్థుణ్ణయినా, ప్రస్తుతం నా అన్నవారులేని అనాధను. తమరు అధర్మంపై సాగిస్తున్న, ఈ జైత్రయాత్రలో, నన్నూ పాల్గొననివ్వమని ప్రార్థించడానికే, ఇక్కడికి వచ్చాను,'' అంటూ కుర్రవాడు సవినయంగా జవాబిచ్చాడు.



కృష్ణభూపతి నవ్వుతూ, "ఊరికే నీ మాటల మీద నమ్మకం పెట్టుకుని, నిన్ను సైన్యంలో చేర్చుకోమంటావు! యుద్ధ విద్యల్లో నీ ప్రజ్ఞా పాటవాలు ఏపాటివో అడగవచ్చునా?" అన్నాడు.

కళాపూర్ణుడు గంభీరంగా, "తప్పకుండా! మీ భటుల్లో ఒకరిని పిలిపిస్తే, నా ప్రజ్ఞను ప్రత్యక్షంగా మీకు చూపిస్తాను," అన్నాడు.

కృష్ణభూపతి చప్పట్లు కొట్టి భటుణ్ణి రప్పించాడు.వచ్చిన భటుడు, కళాపూర్ణుడు చెప్పిన ప్రకారం గుడారం చివరి భాగానికి వెళ్ళి, అక్కడ తెరగా కట్టిన గుడ్డను ఆనుకుని నిలబడ్డాడు. వెంటనే కళాపూర్ణుడు తన దుస్తుల్లోంచి, చిన్న కొయ్యడబ్బీ ఒకటి తీసి, అందులో రెండంగుళాల పొడవున్న సన్నపాటి సూదులను లెక్కబెడుతూ, ఒక్కొటొకటిగా భటుడి తలవైపు విసరడం ప్రారంభించాడు.

పాతిక సూదులు విసిరేసరికి, భటుడి తలచుట్టూ తెరగుడ్డ మీద సూదుల వలయం ఒకటి ప్రత్యక్షమయింది. భటుడు కదిలి ఇవతలికి వచ్చాడు. అప్పటి వరకూ, అత్యంత చాకచక్యంగా ఒకే ఎత్తున శరపరంపరలా దూసుకుపోతున్న సూదులను విభ్రమంగా చూస్తూన్న కృష్ణ భూపతి, భటుడు ఇవతలికి రాగానే, తెర దగ్గరకు వెళ్ళి పరీక్షించి చూశాడు. పాతిక సూదులు ఒకదాని కొకటి సమాన దూరంలో వుండి, చక్కటి అర్ధవలయా కారంలో తెరకు గుచ్చుకుని వున్నవి.

కృష్ణభూపతి అప్రయత్నంగా చప్పట్లు కొట్టి, "అద్భుతం, కళాపూర్ణా!" అంటూ కళాపూర్ణుణ్ణి మెచ్చుకున్నాడు.

కళాపూర్ణుడు వినయంగా, "ప్రభూ!ఇవన్నీ మామూలు సూదులు. అత్యంత ప్రమాద కరమైన విషపు సూదులు కూడా, నాదగ్గర వున్నవి," అన్నాడు.

కృష్ణభూపతి ఆ మాటలకు జవాబేమీ చెప్పకుండా తలపంకించి కొన్ని క్షణాలు వూరుకుని, కళాపూర్ణుణ్ణి సాదరంగా చేయి పట్టుకుని తీసుకువచ్చి, తన పక్కన కూర్చో బెట్టుకోబోయాడు.

"వద్దు ప్రభూ! నేనిక్కడ కూర్చుంటాను, చాలు!" అంటూ కళాపూర్ణుడు సున్నితంగా



రాజు పట్టు విడిపించుకుని, అతడి పాదాల దగ్గర కూర్చున్నాడు.

"అయితే, యుద్ధంలో పాల్గొనాలన్న నీ నిర్ణయానికి తిరుగులేనట్టేనా?" అని అడిగాడు కృష్ణభూపతి.

"ఇంకా,సందేహమా ప్రభూ!విజయమో, వీరస్వర్గమో, ఏదో ఒక లక్ష్యాన్ని చేరడం ముమ్మాటికీ తథ్యం," దృఢస్వరంతో జవాబిచ్చాడు కళాపూర్ణుడు.

కృష్ణభూపతి ఇంకేమీ తర్కించలేదు. భటుల్ని పిలిచి, కళాపూర్ణుడికి కూడా తన గుడారంలోనే విడిది ఏర్పాటు చేయించి, మర్నాటి ఉదయం సైన్యాధిపతికి చెప్పి, కళాపూర్ణుడు తనకు సమీపంలోనే అశ్వారూఢుడై యుద్ధంచేసేట్టు చేశాడు.

మరికొన్నాళ్ళకు యుద్ధం ముగిసింది. నమ్మకద్రోహి అయిన మాల్యవంతుణ్ణి,బాహాబాహిపోరులో చంపిన కృష్ణభూపతి, కుశద్వీపపుకోటపై విజయపతాకం ఎగరవేశాడు. విజయానికి కారకులైనవారిని అభినందిస్తూ, సాక్షాత్తూ అభిమన్యుడిలా విజృంభించి పోరు సాగించిన కళాపూర్ణుణ్ణి, ప్రత్యేకంగా ప్రశంసించాడు.

విజయానంతరం, ఒకవారం రోజులపాటు, కుశద్వీపంలో విజయోత్సవాలను నిర్వహించిన కృష్ణభూపతి, ఒకనాటి రాత్రి కళాపూర్ణుణ్ణి చేరబిలిచి, "కళాపూర్ణా! నీ ఆశయం నెరవేరిందిగదా. ఇక నీ వృత్తాంతమంతా వివరిస్తావా?" అని అడిగాడు.

కళాపూర్ణుడు, రాజు మాటకు వెంటనే జవాబివ్వక, కొద్ది క్షణాలపాటు తలవంచుకుని మౌనంగా వుండిపోయి, చివరకు, "మరొక చిన్న కోరికవున్నది, ప్రభూ! తమరు అనుగ్రహిస్తే..." అంటూ ఆగిపోయాడు.

"ఏమిటో చెప్పు!" అన్నాడు రాజు.

"ప్రభూ! ఎటు తిరిగీ నేను అనాధను. పొట్టకూటికోసం కష్టపడక తప్పదు. మీతోబాటు నన్ను కూడా, మలయద్వీపానికి తీసుకు వెళ్ళినట్టయితే, ఆజన్మాంతం మీ సేవలో గడుపుతాను," వినయంగా అన్నాడు కళాపూర్ణుడు.

కృష్ణభూపతి చిరునవ్వు నవ్వి, "అలాగే, దానికేంభాగ్యం! కాని,ఏదీ ఇంతకు ముందు నువ్వు వసంత మంటప ఉద్యానవనంలో పొగడచెట్టుకింద ఒంటరిగాకూర్చుని, ఏదో కవిత్వగానం చేస్తున్నావే, ఆ కవిత్వాన్ని మరొకసారి వినిపించు," అని అడిగాడు.

ఆ మాటలకు కళాపూర్ణుడు గతుక్కుమని, "ప్రభూ.... మీరు అసలు అక్కడికి

ఎప్పుడు వచ్చారు?'' అంటూ కొద్దిగా తడ బడ్డాడు.

రాజు నవ్వుతూ, ''ఆకాశంలో వెన్నెల కాంతులు వెదజల్లుతున్న పూర్ణచంద్ర బింబాన్ని చూస్తూ- 'ఓ వెన్నెలా! కృష్ణపక్షం లోని కారునల్లని చీకట్లవల్లే, నీ ఈ ధవళ కాంతులకు ఇంతటి ఘనకీర్తి అబ్బింది సుమా! లోకంలో చెడు అనేదే లేకపోతే, మంచికి అంతటి విలువే వుండదు! అందు చేత, ఓ వెన్నెలా! నీ గొప్ప అంతా నీ స్వంత మేనని మురిసిపోకు. అసలు ఘనత అంతా, ఆ కృష్ణవర్ణానిదే!' అంటూ మధుర స్వరంతో కవితాగానం చేస్తున్నావు చూడు, అప్పుడు నేను ఆ పక్కనే వున్న గున్నమావి చెట్టు వెనక నిలబడివున్నాను,'' అన్నాడు.

కళాపూర్ణుడు మాట్లాడలేదు. తలవంచు కుని అలాగే శిలావిగ్రహంలా నిలబడ్డాడు.

కృష్ణభూపతి లేచి కళాపూర్ణుణ్ణి సమీ పిస్తూ, '' నీ ముఖంలోని లాలిత్యం, నీ చేతివేళ్ళ సౌకుమార్యం - ఇవన్నీ నాకు మొదటినుంచీ సందేహాస్పదంగానే వున్నాయి. ఇప్పటికైనా నీ వివరాలుచెప్పి, నా సందేహాలు తీరుస్తావా?'' అని ప్రశ్నించాడు.

కళాపూర్ణుడు వెంటనే ఏ జవాబూ ఇవ్వ లేదు. తలవంచుకునే, తన తల చుట్టూ పాగాలా చుట్టుకున్న పొడవాటి వస్త్రాన్ని ఊడదీశాడు. మరుక్షణం, కారు నల్లని ఒత్త యిన కేశపాశం కృష్ణవేణీ జలపాతంలా జల జలా జారింది. ఆ వెంటనే కృష్ణభూపతి ముందు మోకరిల్లిన ఆ యువతి, ''నా స్వార్థంకోసం మీతో అబద్ధాలు చెప్పినందుకు క్షమించండి, ప్రభూ! నేను కళాపూర్ణుణ్ణి కాదు; కళాకౌముదిని!'' అన్నది.

కృష్ణభూపతి వెంటనే కళాకౌముదిని,రెండు చేతులాపట్టి లేవదీస్తూ, ''నువ్వు సుక్షత్రియ కన్యవై వుంటావని, ఆనాడే గ్రహించాను. రా, ఇలా కూర్చుని, కళాపూర్ణుడి అవతారం ఎందుకు ఎత్తవలసి వచ్చిందీ చెప్పు!'' అంటూ ఆమెను ఆసనంలో కూర్చోబెట్టాడు.

రాజు తనపట్ల చూపిస్తున్న గౌరవాద రాలకు , కళాకౌముది కళ్ళ వెంట ఆనంద బాష్పాలు జలజలా రాలాయి. ఆమె కొద్ది క్షణాల పాటు ఏమీ మాట్లాడలేక మౌనంగా ఊరుకుని, చివరకు నెమ్మదిగా తన గురించి చెప్పడం ప్రారంభించింది.

—( ముగింపు వచ్చే సంచికలో)





# మొండికత్తి మొనగాడు

పూర్వం కోసల రాజ్యంలో, బదరీనాధుడనే పేదవాడుండేవాడు. వాడు దాపులనున్న అడవికి పోయి, వైద్యులు మందులు తయారు చేయడానికి పనికివచ్చే ఆకులనూ, వేళ్ళనూ, మూలికలనూ సంపాదించి, వాటిని అమ్మి కుటుంబ పోషణ చేసేవాడు.

వాడికి మురారి అనే కొడుకున్నాడు. వాడిని బాగా చదివించాలన్నది, బదరీనాధుడి ఆశ. కాని, గ్రామంలో వున్న పాఠశాలను నడిపే పండితుడు, వాణ్ణిపాఠశాలలో చేర్చుకోడానికి నిరాకరించాడు. కూలీనాలీ చేసుకుని పొట్ట పోసుకునే వాళ్ళపిల్లలకు,చదువు అబ్బదన్నది ఆయన నమ్మకం.

బదరీనాధుడు,కొడుకునుచదివించలేక పోయినందుకు దిగులు పడేవాడు. కాలం గడిచింది. మురారికి ఇరవై ఏళ్ళ వయసు వచ్చేసరికి, బదరీనాధుడు వృద్ధుడైపోయాడు. కుటుంబ పోషణ భారం మురారి మీద పడింది. మురారి, తండ్రిలాగే రోజూ అడవికి వెళ్ళి మూలికలూ అవీ తెచ్చి, అవి అమ్మగా వచ్చిన డబ్బుతో కుటుంబపోషణ చేయ సాగాడు.

క్రమంగా బదరీనాధుడి ఆరోగ్యం చెడిపోయింది. కన్నుమూసే సమయాన మురారిని చేరబిలిచి, "నాయనా! ఎంతకాలంగానో రహస్యంగా వుంచిన, ఒక ముఖ్య విషయం ఇప్పుడు నీకు చెబుతున్నాను. నేను అడవిలో తపస్సుచేసుకునే ఒక మునికి, చాలాకాలం సేవలు చేశాను. ఆయన, ఇక్కడ తపస్సు చాలించి హిమాలయాలకు ప్రయాణమవుతూ, నాకొకమొండికత్తిని బహుమతిగా ఇచ్చాడు. ఆ వింత బహుమతికి నేను ఆశ్చర్యపోతుండగా, ఆయన నవ్వి, 'ఆశ్చర్య పడకు! నేనీ అడవికి తపస్సు చేసుకునేందుకు వచ్చినప్పుడు, అందరిలాగే సామాన్యుణ్ణి. విషసర్పాలు, క్రూరమృగాలనుంచి

ఎన్. శివనాగేశ్వరరావు

రక్షణకుగాను వెంట ఈ కత్తిని తెచ్చాను. ఆదిలో నాలో అంతగా తపశ్శక్తులు లేని రోజుల్లో, ఆ కత్తి ద్వారానే క్రూరమృగాల నుంచి ప్రాణరక్షణ చేసుకున్నాను. ఒక నాడు, రాక్షసుడొకడు హుంకరిస్తూ, నా మీదికి వచ్చాడు. నేను కత్తిని వాడి తలకు గురిచేశాను కాని, వాడు దెబ్బ తప్పుకునే ప్రయత్నంలో వెనకడుగు వేయబోయి వెల్లకిలా పడ్డాడు. అప్పుడు, అందుబాటులో వున్న వాడి కుడికాలిమీద గట్టిగా కొట్టాను. కత్తి సగానికి విరిగిపోయింది. రాక్షసుడు మాత్రం గగ్గోలు పెడుతూ అడవిలోకి పారిపోయాడు. ఈ మొండికత్తికి ఇంత చరిత్ర వున్నది! జాతక రీత్యా, నీకిది ఉపయోగించదు కానీ, నీ సంతానానికి అష్ట ఐశ్వర్యాలూ ప్రసాదిస్తుంది!' అన్నాడు. నాయనా! ముని మాటకు తిరుగు వుండదు!'' అంటూ, మురారికి మొండికత్తి ఇచ్చి మరుక్షణమే కన్ను మూశాడు.

మురారి, తండ్రి ఇచ్చిన మొండికత్తికి ఒక ఒర చేయించి, నడుముకు కట్టుకుని తిరగ సాగాడు. వాడి దగ్గర వున్నది మొండికత్తి అని తెలిసి గ్రామస్థులు, వాణ్ణి మొండికత్తి మొనగాడు అని హేళన చేయసాగారు.

అలా సంవత్సరం గడిచింది. తండ్రిలాగే మురారి అడవికి పోయి మూలికలూ అవీ, తెచ్చి అమ్మి తల్లిని పోషించసాగాడు.

ఒకనాడు వాడు తల్లితో, ''అమ్మా, ఎంతో మహత్తుగల మొండికత్తి, ఈనాటి వరకూ నాకు చిన్నమెత్తు మేలు కూడా చేయలేదు. చూడబోతే, ఈ గ్రామం మనకు అచ్చిరానట్టున్నది. నేను మరే ప్రాంతానికైనా పోయి ధనసంపాదన చేయదలచాను. నువ్వు



కొన్నాళ్ళపాటు మేనమామగారింట వుండు,'' అన్నాడు.

అందుకు, తల్లి సరేనన్నది. వాడామెను పక్క గ్రామంలో వున్న మేనమామ ఇంట వదిలి, ఆమె ఇచ్చిన రొట్టెలను సంచీలో వేసుకుని, మొండికత్తితో అడవిలో ప్రవేశించాడు.

మురారి అడవిలో కొంత దూరం వెళ్ళే సరికి, భుజానికి వేలాడుతున్న సంచీలో రొట్టెలున్నవని పసిగట్టిన కోతుల గుంపొకటి, కిచకిచమంటూ వాణ్ణి చుట్టుముట్టింది. వాడు కోతులను తరిమికొట్టేందుకు, అక్కడ దొరికిన చిన్న చిన్న రాళ్ళను తీసుకుని, వాటి మీదికి విసిరాడు. కోతులు చెల్లాచెదురుగా పారిపోయినై.

వాడు, ఇలాంటి ప్రమాదం మళ్ళీ రావచ్చని అనుమానించి కొన్ని రాళ్ళను సంచీలో వేసుకుని, ముందుకు కదిలాడు. మిట్ట



మధ్యాహ్నం వేళకు వాడొక కొలను చేరి, అక్కడవున్న ఒక చెట్టునీడలో కూర్చుని రొట్టెలు తినసాగాడు.

ఆ సమయంలో చెట్టు చాటునుంచి పెద్దగా వికటాట్టహాసం వినిపించింది. మురారి ఆశ్చర్యపోతూ, అటుకేసి చూసేంతలో, తనకేసి వస్తున్న రాక్షసుడొకడు కనిపించాడు. వాణ్ణి చూస్తూనే మురారికి వణుకు పుట్టింది. కాని, అంతలోనే, రాక్షసుడి భుజం కింద వున్న ఊతకర్రలూ, కుడికాలు నేల నానకుండా ఊగిసలాడటం కంటబడింది. ఆహా, వాడేవీడు, అని ధైర్యం తెచ్చుకున్నాడు, మురారి.

రాక్షసుడు, మురారిని సమీపిస్తూనే, ''ఆశ్చర్యం! మహారాక్షసుడికీ, మానవాధముడికీ, ఒకే సమయంలో ఆకలి,'' అన్నాడు వికవికా నవ్వుతూ. ఆ మాటలకు మురారి ఏమాత్రం తొట్రుపాటు లేకుండా, 'వెదకబోయిన రాక్షసుడు ఎదురురావడమంటే ఇదే నన్నమాట! ఆహా, గురుమహాముని ఆజ్ఞ చిటికెలో సిద్ధించిందే!'' అంటూ, ఒరలో నుంచి మొండికత్తిని చర్రున లాగాడు.

మొండికత్తిని చూస్తూనే రాక్షసుడు, గాయపడిన ఏనుగులా కర్ణకఠోరంగా ఘీంకరించి, ''నేను చేసిన తప్పిదాన్ని క్షమించమని, ఆ మహామునికి చెప్పు. ఇంతకూ నువ్వెవరో నాకు తెలియదు,'' అంటూ పారిపోయేందుకు వెనుదిరిగాడు.

మురారి చప్పున వాడి ఊతకర్రలు లాక్కుని, వాడు కుంటుతూ బోర్లాపడగానే, వాడి వీపు మీద కాలువేసి, 'నేను మొండికత్తి మొనగాణ్ణి! మహామునినే మింగజూసిన నిన్ను ప్రాణాలతో వదలను. ఈ మొండి కత్తితో, ముందు కాళ్ళు నరకమంటావా లేక మెడ నరకమంటావా?'' అన్నాడు కోపంగా.

రాక్షసుడు భయంతో కంపించిపోతూ, ''ఓ మొండికత్తి మహావీరా! ఆ రెంటిలో నువ్వేది చేసినా, నేను చచ్చినవాడికిందే లెక్క. అడుగు, ఎలాంటి సాయమైనా చేస్తాను. నేను రాక్షసుణ్ణి గనక, కుంటి కాలితో వేగంగా నడవలేకపోయినా, గాలిలో ఎగర గలను; నీటిలో ఈద గలను,'' అన్నాడు.

ఆ వెంటనే మురారికి ఒక ఆలోచన వచ్చింది. దూరంగా కనబడే అడవులూ, కొండలా వెనక ఒక మహారాజ్యం వున్నదనీ, దాని రాజు సాహసికులైన యువకులకు సైన్యంలో ఉద్యోగాలిచ్చి, మంచి జీతాలిస్తాడనీ లోగడ వినివున్నాడు.

అందువల్ల వాడు, రాక్షసుడితో, ''నన్ను అడవులూ, కొండలూ దాటించి, ఆవల వున్న

రాజ్యానికి చేర్చు," అంటూ, వాడి వీపు మీద కూర్చున్నాడు.

రాక్షసుడు, హుం అంటూ, గాలిలోకి లేచాడు. వాడికి మనసులో, ఎలాగైనా ఈ మొండికత్తి మొనగాణ్ణి హతమార్చాలన్న దురాలోచన వున్నది. ఆ కారణంగా వాడు చెట్లమీద ఎగురుతూ కొంతదూరం పోయి, కొండలను సమీపిస్తూ, హఠాత్తుగా గాలిలో పల్టీ కొట్టాడు. మురారి గుబురుగా వున్న ఒక చెట్టు మీద పడి, దాని కొమ్మనుంచి ఎలాంటి హానీ జరక్కుండా నేలకు దిగాడు.

అక్కడ ఒక దొంగల ముఠా గుమిగూడి వున్నది. వాళ్ళు ఐదుగురు. వాళ్ళముందు విలువైన దుస్తులు ధరించిన ఒక యువకు డున్నాడు. వాడి చేతులు తాళ్ళతో కట్టబడి వున్నవి. చెట్టుకొమ్మల్లో నుంచి హఠాత్తుగా తమ ముందు ప్రత్యక్షమైన మురారిని చూసి, దొంగలు నివ్వెరపోయారు.

మురారి వాళ్ళతో ఏదో అనబోయేంతలో, దొంగల్లో ఒకడు, "భయం లేదు, వీడు మామూలు మనిషే!" అన్నాడు.

ఆ వెంటనే దొంగలనాయకుడు కోపంగా, "ఆ సంగతి తెలుస్తూనే వున్నది, నువ్వుఅతి తెలివి చూపకు! ముందు వీడిదగ్గర డబ్బూ, నగా నట్రా ఏమైనావున్నవేమో చూడండి," అన్నాడు.

దొంగల్లో ఒకడు, మురారి దుస్తుల్నీ సంచినీ వెదికి చూశాడు. వాడికి సంచీలో చిన్నరాళ్ళు మాత్రం కనిపించినై. ఈ సంగతి వాడు చెప్పేసరికి, వీడెవడో వెర్రివాడైవుంటా డనుకుని దొంగలు గొల్లుమంటూ నవ్వారు. ఎంత వెర్రివాడైనా కత్తిని నడుముకు కట్టుకుని



తిరగడుగదా, అన్న అనుమానం కలిగింది, దొంగలనాయకుడికి.

వాడు, మురారితో, "మాకు బందీగా చిక్కిన ఇతడు, కొండల అవతలి రాజ్యపు రాకుమారుడు. ఒక గంట ముందు మేము కత్తులూ, ఈటెలూ పక్కన పెట్టి భోజనాలు చేస్తూండగా, హఠాత్తుగా మామీద దాడి చేశాడు. ఇతడి వెంట వేటకు వచ్చిన భటులు వుండవచ్చని, మేము పారిపోసాగాము. అయినా మమ్మల్ని ఒంటరిగా వెన్నంటి వచ్చి, మాలో ఒకణ్ణి చంపాడు. కత్తి విరిగి పోయింది. చుట్టుముట్టి బందీగా పట్టుకున్నాం. ఏదీ, నీ కత్తి ఇటివ్వు, ముందుగా ఇతగాడి తల నరికి, తరవాత నీ సంగతి చూస్తాం," అన్నాడు.

"అలాగా! నా శక్తి ఏమిటో తెలియక, నువ్వుమూర్ఖంగా మాట్లాడుతున్నావు. ఇంతకు ముందే నీలాంటి బందిపోట్లను కొందరిని రాళ్ళుగా మార్చి సంచీలో వేసుకున్నాను,"

అన్నాడు, మురారి. ఇది విని, దొంగల నాయకుడు హేళనగా నవ్వి, "రాళ్ళుగా మార్చావు సరే! వాటిని సంచీలో వేసుకుని తిరగడమెందుకు?" అన్నాడు.

"మీలాంటి వాళ్ళను రాళ్ళుగా మార్చేశాక, నొప్పి అంటూ తెలియదుగదా! అందుకే, ఈ రాళ్ళను, నా గుహకు తీసుకుపోయి, మంత్రాల బానలో వేసి ఉడికిస్తాను. అప్పుడు వీళ్ళు క్షణక్షణం నరకం అనుభవిస్తారు," అన్నాడు పళ్ళు కొరుకుతూ, మురారి.

ఆ మాటలతో దొంగలకు భయం పట్టుకున్నది. అది గ్రహించిన మురారి, "నేను మహామాంత్రికుడినని, మీ మట్టి బుర్రలకు ఈసరికి అర్థమైవుంటుంది. ఇక కత్తి సంగతి! ఇది, నిరాయుధులను చంపడానికి ఉపయోగపడదు," అంటూ ఏదో మంత్రం చదువుతున్నవాడిలా నటించి, "ఇప్పుడు కత్తిని మొండికత్తిగా మార్చాను," అని ఒరనుంచి మొండికత్తిని వేగంగా బయటికి లాగాడు.

అది చూస్తూనే ఐదుగురు దొంగలూ, "మాంత్రికుడు! మాంత్రికుడు!" అని కేకలు వేస్తూ అక్కడినుంచి తిరిగిచూడకుండా పారిపోయారు.

మురారి, రాకుమారుడి చేతికట్లు విప్పి "తమరిని, ఈ బందిపోట్లనుంచి కాపాడగలనని, నేననుకోలేదు. అంతా, ఆ మహాముని కరుణ!" అన్నాడు.

రాకుమారుడు చిరునవ్వుతో, "ఆ మహాముని కరుణ సంగతి నేనెరుగను. కాని, నీ తెగువా, తెలివితేటలతోపాటు, నీ సమయస్ఫూర్తి నన్ను కాపాడింది. ఈక్షణం నుంచే నువ్వు నా ప్రాణమిత్రుడివి. రాజప్రాసాదం చేరగానే, నాలాగే నీకూ అన్ని సౌకర్యాలూ ఏర్పాటు చేయిస్తాను. తర్వాత, నీకు సుశిక్షితులైన వాళ్ళచేత సైనిక శిక్షణ ఇప్పించదలచాను. నా తండ్రిగారి పాలనలో కాకపోయినా, నా పాలనలో అయినా నువ్వు తప్పక ప్రధాన సేనానివి కాగలవన్నది, నా దృఢవిశ్వాసం," అన్నాడు.

రాకుమారుడి మాటలకు ఎంతో సంతోషించిన మురారి, మనసులో, "ముని దీవెన, కన్నతండ్రి కోరికా, ఆశీస్సులు వృథా కావు!" అనుకున్నాడు.





# చేస్తేనే పొగడ్తలు

పల్లెకోన గ్రామంలోని సాంబయ్య, సావిత్రమ్మల కొడుకు గోపన్న. వాడికిపట్టుమని పదేళ్ళ వయసయినా నిండలేదు. వాడు ఇంట్లో ఎంత చెప్పినా చిన్నమెత్తు పని చెయ్యడు. అయినా, వాడు ఏంచెప్పినా, ఆ పని క్షణాలమీద జరిగిపోవాలి. లేకుంటే నానా అల్లరి చేసేవాడు. ఆ వయసుకే వాడికి గ్రామంలో, అల్లరి గోపన్న అన్న ముద్ర పడిపోయింది.

"ఒక్కరి చేతనైనా మంచివాడనిపించుకోరా! లేకుంటే, అందరిచేతా పీనాసి పీతాంబరం అనిపించుకుంటావు," అని తల్లి తరుచుగా బాధపడేది.

ఈ పీనాసి పీతాంబరంపేరు, గోపన్న చాలా మంది నోట విన్నాడు. గోపన్న మొదట్లో దానిని అట్టే పట్టించుకోలేదు. కాని క్రమంగా వాడికి, ఆ పీతాంబరాన్ని చూడాలని కోరిక పుట్టింది. ఆ విషయం వాడు ఒకనాడు తల్లికి చెప్పాడు.

"ఆయన పిల్లికి బిచ్చం వెయ్యడు. వడ్డీ వ్యాపారం చేస్తూ, ఎందరి కొంపలో కూల్చాడు. వైద్యం చేయించుకుని, వైద్యుడికి డబ్బు ఎగవేశాడు. గ్రామంలో కరువువస్తే, దాచిన ధాన్యాన్ని హెచ్చుధరకుఅమ్మాడు. గ్రామంలో ఒక పండితుడికి ఘనసన్మానం జరుగుతుంటే, అక్కడ వితండవాదం చేసి రసాభాస చేశాడు. దేవుడి హుండీలో రెండణాల చిల్లర డబ్బులు వేసి, తన ఇంటెడు జనానికీ సరిపడ ప్రసాదమిమ్మని గొడవపెట్టాడు. తనకెవరు దణ్ణం పెట్టి పలకరించినా, దాసుని తప్పులు దండంతో సరికావుసుమా, అనిఎగతాళిచేస్తూంటాడు. పలకరించకపోతే కోప్పడతాడు. ఆయన దగ్గర బాగాడబ్బుండడంవల్లనూ, ఆ డబ్బుతో తరుచుగా అవసరపడుతూండడం వల్లనూ, గ్రామస్థులకు ఆయనతో వేగక తప్పడంలేదు! అలాంటివాణ్ణి చూడాలని నీకు బుద్ధిపుట్టడమేమిటి?" అంటూ తల్లి, గోపన్నమీద చిరాకు పడింది.

తల్లి ఇంత చెప్పాక గోపన్నకు, పీతాంబరాన్ని చూడాలన్న కోర్కె మరింతగా బల

శ్రీరామ కమల్



పడింది. అయితే, పిసినారి పీతాంబరం వుండే గ్రామం, తనుంటున్న గ్రామానికి చాలా దూరంలో వుంది.

ఇలావుండగా– ఒకరోజు గోపన్న ఇంటికి పురుషోత్తం అనే ఆయన వచ్చాడు. ఆయనను అందరూ పుణ్యాత్ముడు పురుషోత్తం అనేవారు. గోపన్న ఇంట్లో ఆయనకు బాగా మర్యాదలు జరిగాయి.వాటిని గోపన్న ఆసక్తిగా గమనించాడు.

పురుషోత్తం గురించి,తల్లిదండ్రులద్వారా గోపన్నకు చాలా విశేషాలు తెలిశాయి. ఆయన ప్రతిరోజూ ఒక పేదవాడికి, తన ఇంట అన్నం పెడతాడు. అవసరమై అడిగినవారికి చేతనైన సాయం చేస్తాడు. అందరిలో మంచిని మెచ్చుకుంటాడు. అందుకే, ఏ ఊరువెళ్ళినా చాలమంది ఆయనకు ఆతిథ్యమివ్వాలని పోటీ పడుతుంటారు.

గోపన్నకు, పురుషోత్తం గురించిన పై విశేషాలన్నింటికంటే,ఆయనదీ పిసినారి పీతాంబరందీ, ఒకే ఊరన్న సంగతి ఎక్కువ ఆశ్చర్యాన్ని కలిగించింది. వాడాయనతో, "అయ్యా! మీరు అన్నీ మంచిపనులే చేస్తారట. పీతాంబరంగారన్నీ చెడ్డపనులే చేస్తారట. ఇద్దరూ ఒక గ్రామం వారేకదా! అయినా, మీరీ గ్రామానికివచ్చేదాకా, నాకు మీ పేరు తెలియదు. ఈ గ్రామానికి రాకపోయినా, చాలాకాలంగా నాకు పీతాంబరంగారి పేరు తెలుసు. అంటే, ఈ ప్రపంచంలో మంచి గొప్పదా? చెడ్డగొప్పదా?" అని అడిగాడు అమితాశ్చర్యంతో.

గోపన్న అంత చిన్నవయసులో, ఎంతో ఆలోచనాపరుడిలా అలాంటి ప్రశ్న అడిగే సరికి, పురుషోత్తం ఆప్యాయంగా వాడి భుజం తట్టి, "చాలా మంచి ప్రశ్న వేశావు. కానీ ముందు నీకొక విషయం చెప్పాలి. పీతాంబరం చెడ్డవాడని జనమంటున్నారు. అలాగే, నేను మంచివాడినని జనమంటున్నారు తప్ప, నేననలేదు. జనం నా గురించి చెడ్డగా చెప్పుకుంటే, నాకు బాధగా వుంటుంది. మంచిగా చెప్పుకుంటే చాలా సంతోషంగా వుంటుంది. ఒకవేళ పీతాంబరానికి, జనం తనను గురించి చెడ్డగా చెప్పుకుంటేనే సంతోషమేమో! మంచిగా చెప్పుకుంటే బాధగా వుంటుందేమో!" అన్నాడు.

గోపన్న కొద్ది క్షణాలాగి, "అదే నిజమైతే ఆయన చాలా సంతోషంగా వున్నట్టే. అంతేకాదు. మా ఊళ్ళో ప్రజల మధ్య మీకంటే ఆయనకే ఎక్కువ పేరుంది. ఎక్కువ పేరు తెచ్చుకోవాలంటే మంచివి కాదు; చెడ్డ పనులు చేయాలి కదా!" అన్నాడు.

"సువాసన ఆహ్లాదకరంగా వుంటుంది కానీ, తక్కువ దూరం వ్యాపిస్తుంది. కుళ్ళు ఘాటుగావుండి ఎంత దూరమైనా వ్యాపిస్తుంది. ఐతే, జనం ముక్కులు మూసుకునేలా చేస్తుంది. ఇందులో నీకేది ఇష్టమో, నువ్వే నిర్ణయించుకో, బాబూ!" అన్నాడు పురుషోత్తం నవ్వుతూ.

ఆ తర్వాత, దీనిని గురించి బాగా ఆలోచించగా, గోపన్నకు విషయం చాలావరకు అర్థమైంది.

ఈలోగా, పురుషోత్తం, గోపన్న తల్లిదండ్రులకు, తనకూ గోపన్నకూ జరిగిన సంభాషణ వివరాలు చెప్పాడు. గోపన్న తల్లి ఆయనతో, "మీరు చెప్పవలసిన వాడికి చెప్పారు. ఇంట్లో వాడు చేస్తున్న అల్లరి భరించడం కష్టంగా వుంది. మీ మాటలతో వాడు బాగుపడతాడని ఆశ," అన్నది.

"ఉత్త మాటలకు ఎవరూ బాగుపడరు. మరీ పసిపిల్లల విషయంలో చెప్పనవసరం లేదు. నేనిప్పుడు, మా గ్రామం తిరిగి వెళుతున్నాను. రెండురోజుల్లో తిరిగివస్తాను. మీ వాడిని నాతో పంపండి. వాడు ఒకసారి పీతాంబరాన్ని ప్రత్యక్షంగా చూడడం మంచిది. కుళ్ళు పట్ల అసహ్యం పుట్టాలంటే, కుళ్ళును దగ్గర్నుంచి చూడాలి," అన్నాడు పురుషోత్తం.

తల్లిదండ్రులు గోపన్నను, పురుషోత్తంతో పంపడానికి ఒప్పుకున్నారు. ఇన్నాళ్ళకు పీతాంబరాన్ని చూడాలన్న తనకోరిక తీరుతున్నందుకు గోపన్న ఎంతో సంబర పడ్డాడు. కానీ తీరా ఆ గ్రామం చేరేసరికి, ఆ రోజే పీతాంబరం చనిపోయాడు. గ్రామమంతా ఆ వార్త గుప్పుమని,అందరూ ఆయన గురించే మాట్లాడుకుంటున్నారు. గోపన్న ఆసక్తిగా విన్నాడు.



"పిల్లికి బిచ్చం వేసేవాడు కాడు, నిజానికి అదే మంచి పద్ధతి! నేను అవసరానికి డబ్బిచ్చి ఎందరినో ఆదుకున్నాను. నాకు అవసరపడితే ఒక్కడూ సాయంచేయలేదు సరికదా– ఉన్న డబ్బును తెలివి తక్కువగా ఖర్చుపెట్టానని వేళాకోళం చేశారు. అలాంటి వాళ్ళకు సాయం చేయడం మహాపాపం. పీతాంబరం పుణ్యాత్ముడు. డబ్బును అపాత్రదానం చేయలేదు," అన్నాడొకడు.

"గూబ మెలేసి మరీ నాదగ్గర వడ్డీ వసూలు చేశాడని అప్పట్లో తిట్టుకున్నాను కానీ, ఆ దెబ్బతో నేను మళ్ళీ ఎవరి దగ్గరా అప్పు చేయలేదు. అప్పుచేసి పప్పుకూడు తినకూడదని, ఆ మహానుభావుడివల్లే అర్థమై; ఇప్పుడు నేను బాగుపడ్డాను," అన్నాడింకొకడు.

తర్వాత, పురుషోత్తం, గోపన్నను వెంట బెట్టుకుని పీతాంబరం ఇంటికి వెళ్ళాడు. ఇంటి ముందు ఒక్కగానొక్క మనిషి కూడా లేడు. లోపలినుంచి మాత్రం, సన్నగా ఏడుపులు వినబడుతున్నవి. ఇది చూసి విపరీతంగా ఆశ్చర్యపడుతున్న గోపన్నతో, పురుషోత్తం, "ఇక ఇంటికి వెళదామా?" అన్నాడు. గోపన్న తల ఊపి వెనుదిరిగాడు.

ఇద్దరూ ఇల్లు చేరాక గోపన్న, పురుషోత్తంతో, "అయ్యా, పీతాంబరాన్ని గురించి వీధుల్లో అక్కడక్కడా ఏవో నాలుగు మాటలంటున్నారు తప్ప, ఆయన్ను చూసేందుకు ఒక్కరంటే ఒక్కరు కూడా, ఆయన ఇంటి కేసి వెళ్ళలేదేం?" అని అడిగాడు.

పురుషోత్తం నవ్వి, "చచ్చిన వాడి కళ్ళు చారెడేసి అన్నది సామెత. చనిపోయిన వారి గురించి మంచిని మాత్రమే మాట్లాడడం, మన సంప్రదాయం. పీతాంబరం గురించి బ్రతికుండగా, ఒక్కరూ మంచిమాట అనలేదు. ఆయన గురించి మంచి మాట వినాలంటే, చావు తప్ప వేరే మార్గం లేదు. సాధారణంగా మంచినీ పొగుడుతారు, చెడ్డనీ పొగుడుతారు. మంచికి బ్రతికుండగా పొగడ్తలు; చెడ్డకు చస్తేనే పొగడ్తలు! ఆలోచించి చూడు– ఏ పద్ధతి మంచిదో!" అన్నాడు.

గోపన్నకు విషయమంతా, అరటిపండు వలిచినట్టు అర్థమైంది. వాడికి బ్రతికుండగానే అందరిచేతా మంచివాడనిపించుకోవడంలోనే, ఆనందముందనిపించింది. ఇంటికి తిరిగివెళ్ళాక, వాడిలో వచ్చిన మంచి మార్పుకు తల్లిదండ్రులు ఎంతో సంతోషించారు.



66. స్వర్గారోహణ

# మహాభారతం

తరవాత ధర్మరాజు విందుభోజనాలతో ఋషులను తృప్తిపరచి, కృష్ణుడి తరఫున గొప్ప దానాలు చేశాడు; పరీక్షిత్తును కృపుడికి శిష్యుడుగా ఇచ్చేశాడు; తన మంత్రులను పిలిచి తాను మహాప్రస్థానం చెయ్యబోతున్నట్టు చెప్పాడు; వాళ్ళు బాధతో రకరకాల అభ్యంతరాలు చెబితే, వారినందరినీ ఎలాగో ఒప్పించాడు.

తరవాత పంచపాండవులూ, ద్రౌపదీ తమ ఆభరణాలన్నీతీసేసి,నారబట్టలు ధరించారు; తమ అగ్నులన్నిటినీ నీట గలిపి,భవనాలు వదిలి బయలు దేరారు. ఆ స్థితిలో వాళ్ళను చూస్తూ ఉంటే, కొన్ని సంవత్సరాల క్రితం జూదంలో ఓడి, వారు వనవాసం బయలు దేరటం గుర్తుకు వచ్చి, పౌరస్త్రీలు ఎంతో దుఃఖించారు.కాని పాండవులు మాత్రం ఏమాత్రమూ చింతించలేదు. నిర్విచారంగా ముందుకు నడిచారు.

వాళ్ళు నగరం దాటి పోతూంటే కుక్క ఒకటి వారి వెంట బయలుదేరింది. కుక్కతో సహా ఏడుగురూ మహాప్రస్థానం బయలు దేరారు. వాళ్ళ ఉద్దేశాన్ని మార్చే ఉద్దేశంతో కొందరు పౌరులు వారి వెంట కొంతదూరం వెళ్ళి, వెనక్కు తిరిగారు.

ద్రౌపదితో సహా పాండవులు వెళ్ళిపోయే సరికి, ఉలూపి గంగానదిలోకీ, చిత్రాంగద





మణిపురానికి వెళ్ళిపోయారు. పాండవుల మిగిలిన భార్యలు పరీక్షిత్తు వెంట ఉండి పోయారు.

ముందుగా పాండవులు తూర్పు దిక్కుగా, ఒకరివెనక ఒకరు నడుస్తూ, ప్రయాణించారు. వాళ్ళు మెల్లగా అనేక దేశాలూ, నదులూ దాటి కాలక్రమాన లౌహిత్యం అనే సముద్రాన్ని చేరారు.

అర్జునుడు అన్నదమ్ములతో కలిసి సాగి స్తూన్న ఈ మహాప్రస్థానంలో ఇంకా తన గాండీవాన్నీ, అక్షయతూణీరాలనూ తన వెంటనే ఉంచుకుని ఉన్నాడు.

వారి దారిలో అగ్నిదేవుడు కొండలాటి శరీరంతో ఎదురు తగిలి, ''పాండవులారా, నేను అగ్నిదేవుణ్ణి. అర్జునుడికి ఇక గాండీవంతో పనిలేదు. దాన్ని అతను వదిలిపెట్టాలి. అది వరుణుడిది. దాన్ని వరుణుడికి తిరిగి ఇచ్చె య్యాలి,'' అన్నాడు.

అర్జునుడు మిగిలిన వాళ్ళుచెప్పిన మీదట తన గాండీవాన్నీ, అక్షయతూణీరాలనూ సముద్రంలో పడేశాడు.

తరవాత పాండవులు దక్షిణంగా తిరిగి, సముద్ర తీరం వెంబడి నైరృతీ దిశగా నడిచి, పడమరకు తిరిగారు. సముద్రంలో మునిగిన ద్వారక వారికి కానవచ్చింది. అక్కడి నుంచి వారు ఉత్తరంగా నడిచారు. వారికి హిమాల యాలు తగిలాయి; వాటిని దాటివెళ్ళగా వారికి మేరుపర్వతం కనిపించింది.

ఇలా వారు నడుస్తూ ఉండగా, దారిలో ద్రౌపది చచ్చిపడిపోయింది. భీముడు ఆ సంగతి ధర్మరాజుకు చెప్పేసరికి, ధర్మరాజు వెనక్కు తిరిగి అయినా చూడకుండా ముందుకు సాగాడు.

తరవాత కొంతసేపటికి సహదేవుడు పడి పోయాడు. ఇలా వరసగా నకులుడూ, అర్జు నుడూ కూడా పడిపోయిన సంగతి భీముడు ధర్మరాజుకు తెలిపాడు. తరవాత భీముడు కూడా తాను పడిపోతున్నానని చెప్పి, పడి పోయాడు. ధర్మరాజు మాత్రం వెనక్కు తిరిగి చూడకుండా ముందుకు సాగాడు. కుక్క మాత్రం ధర్మరాజు వెనకగా అలాగే నడుస్తూనే ఉన్నది.

కొంతసేపటికి పెద్దమోతతో ఇంద్రుడు తన రథంలో వచ్చి, ధర్మరాజును ఆ రథంలో ఎక్కమన్నాడు. ధర్మరాజు ఇంద్రుడితో, ''నా తమ్ములంతా చనిపోయారు గదా! వారు కూడా నాతో రావాలి. ద్రౌపది కూడా మా వెంట ఉండాలి. ఇందుకు సమ్మతించు. వాళ్ళు లేకుండా నేను స్వర్గానికి పోగోరను,'' అన్నాడు. దానికి ఇంద్రుడు, ''వాళ్ళందరూ



తమ శరీరాలను వదిలిపెట్టి ఇదివరకే స్వర్గానికి చేరారు. నీకు బొందితో స్వర్గం లభిస్తున్నది,'' అన్నాడు.

''అయితే, ఈ కుక్క ఎంతో విశ్వాసంతో నా వెంట వస్తున్నది. దాన్ని కూడా స్వర్గానికి తీసుకు పోవాలి,'' అన్నాడు ధర్మరాజు.

''నా అంతవాడివై స్వర్గానికి పోతున్న నీకు ఇంకా ఈ కుక్కతో ఏం పని? దీన్ని విడిచి పెట్టు,'' అన్నాడు ఇంద్రుడు.

ధర్మరాజు అందుకు ఒప్పుకోలేదు. కుక్కలకు స్వర్గంలో చోటు లేదని ఇంద్రుడు ఎన్ని విధాలుగా చెప్పినా ఆయన వినిపించుకోలేదు.

అప్పుడు కుక్క రూపంలో ఉన్న యముడు ధర్మరాజు ముందు ప్రత్యక్షమై, ''నిన్ను వనవాసమప్పుడు యక్షుడి రూపంలో ఒకసారి పరీక్షించాను. ఇప్పుడు మళ్ళీ కుక్కరూపంలో పరీక్షించాను. నీతో సమానుడు స్వర్గంలో కూడా లేడు. శరీరంతో నువ్వు ఉత్తమ లోకాలకు పోగలవు,'' అన్నాడు.

ఇంద్రుడూ, యముడూ, మరుత్తులూ, అశ్వనీదేవతలూ, ఇతర దేవతలూ ధర్మరాజును రథంలో కూర్చోబెట్టి, తమ విమానాలలో ఆయన వెంట బయలుదేరారు.

''ఎందరో రాజర్షులు ఉత్తమ లోకాలకు వచ్చారు గాని, బొందితో ఇలా వస్తున్న ధర్మరాజుకు ఎవరూ సాటికారు,'' అని నారదుడు అన్నాడు. ''సుఖమైనా, దుఃఖమైనా నా తమ్ములు లేని స్థానం నాకు అవసరం లేదు,'' అన్నాడు ధర్మరాజు.

ఇంద్రుడు ఆయనతో, ''రాజా, ఉత్తమ లోకాలకు పోతున్నా నువ్వు మానవ సంబంధాలను విడిచిపెట్టవేమిటి? నీ తమ్ములు ఉత్తమలోకాలకు పోలేదు. ఈ స్వర్గాన్నీ, దేవతలనూ, సిద్ధులనూ, దేవఋషులనూ చూడు!'' అన్నాడు.



''నా తమ్ములను విడిచి ఉండలేను. వాళ్ళూ, ద్రౌపదీ, మా కొడుకులూ ఎక్కడ ఉంటే నేను అక్కడికే పోతాను,'' అన్నాడు ధర్మరాజు.

స్వర్గానికి చేరుకున్న ధర్మరాజు అక్కడ ఉత్తమాసనం మీద కూర్చుని, దేవతల మధ్య వెలిగిపోతున్న దుర్యోధనుణ్ణి చూశాడు. ఆయనకు వెంటనే అసూయపుట్టి, అక్కడి నుంచి వెనక్కు తిరిగి, ''లోభి అయిన ఈ దుర్యోధనుడితో బాటు నాకు స్వర్గ సుఖాలు వద్దు,'' అన్నాడు.

నారదుడు నవ్వి, ''రాజా, స్వర్గంలో పాత పగలు విడిచిపెట్టాలి. ఈ దుర్యోధనుడు వీరమరణం పొంది, స్వర్గం సాధించు కున్నాడు,'' అన్నాడు.

దానికి ధర్మరాజు, ''సమస్త పాపాలకూ ఒడిగట్టిన ఈ దుర్యోధనుడికి స్వర్గం లభిస్తే, మహాపుణ్యాత్ములైన నా తమ్ములకు ఏ ఉత్తమ లోకాలు లభించాయో నేను తెలుసుకోవాలి. ధృష్టద్యుమ్నుడూ, అభిమన్యుడూ, ఉప పాండవులూ మొదలైనవారు ఎక్కడ ఉన్నారో,'' అని నారదుడితో అన్నాడు.

కర్ణుడూ, తన కోసం యుద్ధంలో ప్రాణాల ర్పించిన రాజులూ స్వర్గంలో కనిపించక పోవటం చూసి ధర్మరాజు ఆశ్చర్యపోయాడు. ఆయన అలా అనటం విని, ''వారున్న చోటికే పద. నీ ఇష్టప్రకారం జరపమని ఇంద్రుడు మాకు ఆజ్ఞ ఇచ్చాడు,'' అన్నారు దేవతలు. వాళ్ళు ఒక దూతను పిలిచి, ధర్మరాజుకు ఆయన కోరిన వారందరినీ చూపమన్నారు. ఆ దూత ధర్మరాజును వెంటబెట్టుకుని, భీముడు, కర్ణుడు మొదలైన వారున్నచోటికి బయలు దేరాడు.

వాళ్ళు వెళ్ళే దారిలో పాపులున్నారు. మార్గం నడవడానికి ఏమీ సుఖంగాలేదు. దారినిండా నెత్తురూ, మాంసమూ ఉన్నాయి. ఈగలూ, దోమలూ ముసురుతున్నాయి. ఎటు చూసినా జుట్టూ, ఎముకలూ, క్రిమి కీటకాలూ, మంటలూ ఉండి భయంకరంగా కనబడుతున్నాయి. దారిలో సెగలు కక్కు తున్న వేడినీరు గల నది కనిపించింది.

ధర్మరాజు తన ముందు నడిచే దేవ దూతతో, ''ఇలా మనం ఇంకా ఎంత దూరం వెళ్ళాలి?'' అన్నాడు.

''నీకు శ్రమగా ఉన్నట్టున్నది. తిరిగి పోదాం. ఇక ముందు నడవదగిన దారి కూడా లేదు,'' అన్నాడు దేవదూత.

ధర్మరాజుకు నిరాశతో బాటు, దుర్గంధం మూలంగా తల తిరిగిపోయింది. ఇంతలో కొన్ని గొంతులు దీనంగా, ''ధర్మరాజా, నువ్వు రావటంవల్ల మాకు కాస్త సుఖంగా ఉన్నది.



రెండు ఘడియలు ఆగు,'' అనటం వినిపించింది.

''మీరంతా ఎవరు? ఎందుకిక్కడ విలపిస్తూ ఉన్నారు?'' అని ధర్మరాజు ఆ కంఠాలను అడిగాడు.

''నేను కర్ణుణ్ణి! నేను భీముణ్ణి! నేను అర్జునుణ్ణి! నేను నకులుణ్ణి! నేను సహదేవుణ్ణి! నేను ద్రౌపదిని!'' అని ఆ గొంతులు సమాధానమిచ్చాయి.

ఇది విని ధర్మరాజు తనలో, ''ఈ పుణ్యాత్ములంతా ఏ పాపాలు చేశారు? ఏ పుణ్యం చేసి దుర్యోధనుడు అక్కడ స్వర్గసుఖాలు అనుభవిస్తున్నాడు? ఇదంతా ఏమిటి? ఏమిటీ విపరీత దృశ్యాలు? నేను నిద్రపోతున్నానా? మేలుకుని ఉన్నానా? పీడ కలలు కంటున్నానా? నాకు పిచ్చిగాని పట్టిందా?'' అని రకరకాలుగా బాధపడ్డాడు.

ఆయనకు దేవతలమీదా, ధర్మంమీదా అమితమైన కోపంవచ్చి తిట్టిపోశాడు. తరవాత ఆయన దేవదూత కేసి తిరిగి, ''నువ్వు ఎవరి దూతవో వారి దగ్గరికి పో. నేను వారి వద్దకు రానని చెప్పు. నేను నా సోదరులను విడిచి రాను. నా రాకతో వాళ్ళు కాస్త సుఖపడుతున్నారు,'' అన్నాడు.

దేవదూత ఇంద్రుడి వద్దకు తిరిగివెళ్ళి జరిగిన సంగతి చెప్పాడు.

ధర్మరాజు రెండు ఘడియలపాటు అక్కడే ఉండిపోయాడు. ఇంతలో ఇంద్రుడు మొదలైన దేవతలు అక్కడికి వచ్చారు. వారు రాగానే అక్కడి చీకటి అంతా పోయింది. పాపుల ఆక్రందనలు ఆగిపోయాయి. వేడి సెగలు చిమ్మే వైతరణి అదృశ్యమయింది. సుఖమైన వాయువులు మెల్లగా వీచి, సువాసనలు వచ్చాయి.

ఇంద్రుడు ధర్మరాజుతో, ''ధర్మరాజా, నీ ప్రవర్తనను దేవతలు మెచ్చారు. ఇక చాలు, వచ్చెయ్యి. నువ్వు సిద్ధి పొందావు. నీకూ, నీ తమ్ములకూ ఉత్తమలోకాలు కలుగు తున్నాయి. కోప్పడవద్దు. ప్రతి వ్యక్తి తాను చేసిన పుణ్య పాపాలలో ముందు పుణ్యం అను భవిస్తే తరవాత పాపం అనుభవించక తప్పదు. అలాగే ముందు పాపం అనుభ వించినవాడు తరవాత పుణ్య ఫలితం పొందుతాడు. తక్కువ పాపం చేసినవాడు ముందుగా నరకం అనుభవిస్తాడు. అందుకే నిన్ను ముందు నరకానికి పంపాను.నీ తమ్ములూ, ద్రౌపదీ కూడా తాము చేసు కున్న కొద్ది పాపానికి నరకం అనుభవించారు. వారికి పాప విముక్తి కలిగింది. ఇప్పుడు నీ వారంతా స్వర్గంలో ఉంటారు. వచ్చి చూడు. నీవు కర్ణుణ్ణి గురించి కూడా ఆదుర్దా పడుతున్నావు. అతనికి కూడా స్వర్గప్రాప్తి కలిగింది. నీవు రాజులు సంపాదించే కన్న ఎక్కువ పుణ్యం సంపాదించావు. హరి శ్చంద్రుడూ, మాంధాతా, భగీరథుడూ, దుష్యంతుడి కొడుకైన భరతుడూ పొందిన స్థానాలు నీకు లభిస్తున్నాయి. ఇదిగో ఆకాశగంగ. భావాలన్నీ పోతాయి,'' అన్నాడు.

ధర్మరాజు ఆకాశగంగలో తన మానవ శరీరాన్ని విడిచిపెట్టి, తిన్నగా తనవారున్న చోటికి వెళ్ళాడు.

అక్కడ ఆయనకు కృష్ణుడు కనిపిం చాడు. అతను ఇప్పుడుకూడా గుర్తించ దగిన రూపంలోనే ఉన్నాడు. అర్జునుడు కృష్ణుడి వెంటనే ఉన్నాడు. ధర్మరాజును చూసి వాళ్ళు గౌరవంగా ఆయనను సమీపించారు.

ఇంకొక చోట ఆదిత్యులలాగా ప్రకా శిస్తూ కర్ణుడు కనిపించాడు. భీముడు పూర్వపు రూపంలోనే మరుద్గణాల మధ్యకానవచ్చాడు. అలాగే నకుల సహదేవులు అశ్వనీ దేవతల స్థానంలో కనిపించారు.

ఇంద్రుడు ధర్మరాజుకు ద్రౌపదినీ,ఆమె కొడుకులనూ అభిమన్యుణ్ణీ,పాండురాజునూ, కుంతీమాద్రులనూ, భీష్మద్రోణులనూ, యుద్ధంలో వీరమరణం పొందిన ఇతర యోధులనూ చూపించి, వారిని గురించి వివరాలు చెప్పాడు. - (అయిపోయింది)









గరుడుడి ఎనిమిదిమంది అనుచరులు, గరుడుడిలాగే వేషాలు వేసుకుని ఎనిమిది దిక్కులలో దళనాయకులతో, సైనికులతో కుహనా యుద్ధానికి దిగారు.




తన సైనికులు విజయం సాధిస్తున్నట్టు సేనాధిపతి దర్బారులో గొప్పలు చెప్పసాగాడు.


"సేనాధిపతీ! మన సైనికులు గరుడుణ్ణి పట్టుకున్నారా? మరి గరుడుడు ఎక్కడ?"


"ఆ వివరాలన్నీ ఇప్పుడు చెప్పను! త్వరలో నువ్వే నీ కళ్ళారా గరుడుణ్ణి చూడగలవు!"


ఆ రోజురాత్రి, సేనాధిపతి తన శయన మందిరంలో గరుడుడు నిద్రపోతూండడం చూశాడు. అతడు చప్పట్లు చరిచి అంగరక్షకులను పిలిచాడు.


"వాళ్ళ అవసరం లేదు సేనాధిపతీ! వాళ్ళు ఒక్క అడుగుకూడా ముందుకు వేయనవసరంలేదు!"


"నీకు ధైర్యం ఉంటే నాతో యుద్ధానికి రా! ద్వంద్వయుద్ధం చేద్దాం!"


నరేంద్రదేవుడు కత్తిదూసి గరుడుడిమీదికి ఉరికాడు. గరుడుడు లాఘవంగా కత్తివేటు నుంచి తప్పించుకున్నాడు.


మెరుపులా ఇక్కడ, అక్కడ ఎటుచూసినా గరుడుడే కనిపించాడు.
గరుడుడి ఒక్కదెబ్బతో నరేంద్రదేవుడి చేతిలోని కత్తి ఎగిరి దూరంగా పడింది. అతడు కుప్పకూలిపోయాడు.


అదేసమయంలో గరుడుడు సరస్సులోని పడవలోఉన్నాడని తెలియగానే ఎనిమిది మంది దళనాయకులూ హుటాహుటిగా సరస్సులోని ఆ పడవకేసి బయలుదేరారు.


దళనాయకులు ఆ పడవను సమీపించారు. గరుడుడు పడవలో నిద్రిస్తూ కనిపించాడు.


గరుడుడు స్పృహతప్పి పడి ఉండడం చూసి వాళ్ళెంతగానో సంతోషించారు.


గరుడుడి ముఖం ముసుగును సేనాధిపతే తొలగించాలని ఒక దళనాయకుడు సూచించాడు. మిగిలిన దళనాయకులు దానిని ఆమోదించారు.


"గొలుసులతో బంధించి, వీణ్ణి రాజు దగ్గరికి లాక్కువెళదాం!"
ఇంకావుంది



# మారిన మనిషి

పూర్వం కళింగపట్టణంలో మహాజనుడు అనే గొప్ప వర్తకుడు ఉండేవాడు. ఆయన వ్యాపారదక్షతగలవాడు కావటమేగాక,న్యాయ నిర్ణయంచెయ్యటంలో పేరు ప్రఖ్యాతులు గడించినవాడు. అనేకమంది తగాదాలు పడి, ఆయన వద్దకు వచ్చి, ఆయన చేసిన నిర్ణ యాన్ని శిరసావహించేవాళ్ళు. ఆ విధంగా ఆయనకు ప్రజలలో గొప్ప పలుకుబడి ఉండేది. మహాజనుడికి శంభుడు అని ఒక కొడుకు ఉండేవాడు. వాడికి తండ్రి తెలివి తేటలుపట్టుబడలేదుగాని,ధనవంతుడి కొడు కుకు అలవడదగిన తాగుడూ,జూదమూ, దుష్టులతో స్నేహమూలాటి దురలవాట్లన్నీ పట్టుబడ్డాయి. వాడి దురలవాట్లు మాన్ప టానికి తండ్రి కొడుక్కు నయానా భయానా ఎంతో చెప్పాడు.అయినా ఆయన మాట ఒక్కటి కూడా వాడి చెవికెక్కలేదు. మహా జనుడు చేసిన హితబోధలన్నీ బూడిదలో పోసిన పన్నీరు అయ్యాయి. తండ్రి ఎంతో కాలంగా కష్టపడి సంపాదించుకున్న కీర్తి ప్రతిష్ఠలను శంభుడు క్రమంగా నీటగలప సాగాడు.

కొడుకు సమస్య మహాజనుణ్ణి బాధిం చింది. ఒక్క కొడుకు కావటంచేత వాణ్ణి తీవ్రంగా శిక్షించలేడు. అయినా, వాడి బుద్ధి చెడ్డదికాదు. వాడికి తండ్రిమీద ప్రేమ కూడా ఉన్నది. కాని తండ్రి హితబోధలు వాడి చెవికి ఎక్కవు. పైగా దుర్వ్యసనాలకు వాడు బానిస అయిపోయాడు. మహాజనుడు బాగా ఆలో చించి, ఒక నిర్ణయానికి వచ్చాడు. కొన్నాళ్ళు శంభుడికి దూరంగా ఉందామనీ, తన అండ లేకపోతే వాడు మారవచ్చుననీ నిశ్చయించు కున్నాడు.

ఒకరోజు ఆయన శంభుడితో, ''చూడు, నాయనా! నేను సముద్రవ్యాపారంమీద చాలాదూరం పోతున్నాను. అందుకని దగ్గిర వున్న డబ్బు అంతా పట్టుకుపోతున్నాను,'' అన్నాడు.

శంభుడు ఈ మాట విని దిగులుపడి, ''డబ్బు లేకపోతే నాకు ఇక్కడ గడవడం ఎలా?'' అన్నాడు.

''అవును బాబూ, దానికోసమేగదా పోతున్నాను? డబ్బు సంపాదించడానికి మొదట పెట్టుబడి కావాలిగా? అయినా నువ్వేమీ దిగులుపడకు, నీకు కావలిసిందంతా అప్పు చెయ్యి, నేను తిరిగి వచ్చాక తీరుస్తాను,'' అని చెప్పి, మహాజనుడు బయలు దేరి వెళ్ళాడు.

తండ్రి వెళ్ళిపోవటంతో శంభుడికి మరింత స్వేచ్ఛ వచ్చినట్టయింది. వాడు మరింత ఉత్సాహంగా తన దుర్వ్యసనాలలో మునిగి తేలసాగాడు. అందుకు అవసరమైన డబ్బు కోసం దొరికినచోటనల్లా అప్పుచేశాడు.

కాని కొంతకాలం గడిచాక సాటివర్తకులు అప్పులు ఇవ్వడానికి నిరాకరించారు. అయినా శంభుడు దానిని లక్ష్యపెట్టక, ఇంట్లో ఉండే నగా, నట్రా అమ్మి తన ఖర్చులు గడుపుకోసాగాడు.

ఇలా ఉండగా, ఒకనాడు శంభుడి వద్దకు ఇద్దరు నావికులు వచ్చి, ''అయ్యా, ఏం చెప్పమన్నారు? కొద్ది రోజుల క్రితం మీ నాన్నగారి నౌక సముద్రంలో మునిగిపోయింది. అందులో ఉన్నవాళ్ళు అందరూ పోయారు. సరుకంతా సముద్రంపాల యింది. మేమిద్దరమూ ఎలాగో ప్రాణాలు దక్కించుకుని బయటపడ్డాం,'' అంటూ దుఃఖంతో కంట తడిపెట్టారు.

ఈ వార్తవిని శంభుడు నిలువునా కుంగి






పోయాడు. ముందు ఏం జరగబోయేదీ అతనికి అంతుబట్టలేదు. కాని త్వరలోనే అతనికి తన పరిస్థితి అనుభవపూర్వకంగా తెలిసి రాసాగింది. మహాజనుడు పోయినవార్త తెలిసి నగరంలోని వర్తకులు తమకు మహాజనుడు బాకీఉన్న అప్పులన్నీ శంభుడినుంచి వసూలు చేసుకోసాగారు. ఆ బాకీలు తీర్చటానికి శంభుడు తన ఇల్లుతప్ప మిగిలిన ఆస్తి అంతా అమ్మవలసి వచ్చింది. కానీ ఇంకా కొత్త అప్పులు పుట్టుకు వస్తూనే ఉన్నాయి.

శంభుడు కంగారుపడి, తనకు రావలసిన బాకీలు ఏమి ఉన్నాయోనని పద్దుల పుస్తకాలు తిరగవేశాడు. వసూలుకావలసిన బాకీలు కూడా చాలా వున్నాయి. శంభుడికి తిరిగి ఆశకలిగింది. ఆబాకీలు వసూలుచేసుకురమ్మని అతను మనుషులను పంపాడు. అయితే ఒక్క బాకీకూడా వసూలు కాలేదు. తాము ఆ బాకీలు ఏనాడో తీర్చామనీ, అవి తీరినట్టు మహాజనుడు తమకిచ్చిన రశీదులు ఉన్నాయనీ బాకీదార్లు అన్నారు. వాటిని తెచ్చి చూపారు.

తన తండ్రి చేసిన అప్పులు తాను తీర్చే మార్గం లేకుండా పోయేసరికి శంభుడికి ఒక అనుమానం వచ్చింది. తన తండ్రి ఇన్ని అప్పులు ఎందుకు చెయ్యవలసి వచ్చింది? అవన్నీ దొంగపత్రాలని అనుమానం తగిలి అతను వాటిని నిపుణులచేత పరీక్ష చేయించాడు. నిపుణులు పత్రాలను పరీక్షించి, వాటిమీది సంతకాలన్నీ మహాజనుడివేనని చెప్పారు.

శంభుడు తన తండ్రి చేసిన అప్పులు తీర్చలేకపోయాడు. అప్పులవాళ్ళు పత్రాలు తీసుకుని అతనివద్దకు రావటం మానేశారు. వారితోపాటు శంభుడి పాతమిత్రులు కూడా రావటం మానేశారు. ఆఖరుకు నగరంలో ఒక కాకికూడా అతని ఇంటిమీద వాలటం మానేసింది. అందరూ తనను వెలివేసినట్టయి, శంభుడు చాలా బాధపడ్డాడు. మానసికంగా అతనిలో పెద్ద మార్పు కలిగింది. అతను గడచినదంతా ఒక పీడకలగా భావించి, ఉన్న దానితో సరిపెట్టుకుని పేద వాడుగా బతకటం నేర్చుకున్నాడు. ఇదే నిజమైన బతుకు అని అతనికి అనిపించింది.

ఇలా ఉండగా ఒకనాడు శంభుడి పుట్టిన రోజు వచ్చింది. అతను తన పుట్టినరోజు పండుగ చేసుకునే ఆలోచనలో లేడు. కానీ అతని నిమిత్తం లేకుండా పెద్దఎత్తున పండుగ ఏర్పాట్లు చకచకా జరగసాగాయి. ఎవరో వచ్చి, ఇల్లంతా ఇంద్రభవనంలాగా అలంకరించారు. కొత్తకొత్త వస్తువులు తెచ్చి దించారు.

అతను పిలవకుండానే ఎక్కడెక్కడి నుంచో బంధుబలగం చూస్తూండగానే బిలబిలా వచ్చేసింది.

ఇల్లంతా పెళ్ళిసందడి చూసి శంభుడు విస్మయం చెందాడు. నగరంలోని వర్తకు లంతా వచ్చి కూర్చున్నారు. శంభుడికి ఆశ్చ ర్యంతోబాటు ఆనందం కూడా కలిగింది. వాళ్ళనందరినీ చూస్తూంటే అతనికి తండ్రి జ్ఞాపకంవచ్చి, చెప్పరాని దుఃఖం ముంచు కొచ్చింది. అదేక్షణంలో మహాజనుడు ఎక్కడి నుంచోవచ్చి శంభుణ్ణి కౌగలించుకున్నాడు. శంభుడు ఒక్కక్షణం తన కళ్ళను తానే నమ్మలేక పోయాడు.

"అవును బాబూ, నేను బతికే ఉన్నాను. నిన్నూ నీ చర్యలనూ, అనుక్షణం కనిపెడు తూనేఉన్నాను. నీలోమార్పు తీసుకు రావ టానికి ఈ నాటకం ఆడవలసి వచ్చింది," అన్నాడు మహాజనుడు.

శంభుడు తండ్రి కాళ్ళమీదపడి, "ఇంతకాలమూ మీ మనసును ఎంత బాధపెట్టానో ఇప్పుడు తెలిసివచ్చింది. ఇక ఎన్నడూ అలా చేయను," అన్నాడు.

మహాజనుడి కళ్ళల్లో ఆనందబాష్పాలు నిలిచాయి. అది చూసి శంభుడు తల దించేసుకుని, "నేనైతే మారాను గాని, మనం ఇప్పుడు చాలా బీదవాళ్లం. అప్పులవాళ్ళు వచ్చి, అంతా పట్టుకుపోయారు. మనకు బాకీలున్నవాళ్ళు మీ సంతకాలతో రశీదులు చూపించారు వాటిని మీరు కూడా పరీక్ష చెయ్యండి," అన్నాడు.

మహాజనుడు నవ్వుతూ, "పత్రాలూ, రశీదులూ వాళ్ళు సృష్టించినవి కావు. నేను సృష్టించినవే. అవి నిజంకాదు. నీ దగ్గిర డబ్బు లేకుండా చెయ్యటానికి చేసిన ప్రయత్నం. డబ్బంతా నా వద్దనే ఉన్నది," అన్నాడు.

తన అవివేకం వల్ల సర్వనాశనం కలగ కుండా తండ్రి జాగ్రత్తపడినందుకు శంభుడు సంతోషించి, తండ్రికి నచ్చిన విధంగా మసలు కుంటూ అచిరకాలంలో మంచిపేరు తెచ్చు కున్నాడు.



# చందమామ కబుర్లు

## తగ్గిన వాలు!

ఇటలీలోని పీసా గోపురం గురించి అందరికీ తెలుసు. వాలుగా ఉన్న ఈ గోపురం ఆధునిక ప్రపంచంలోని తొమ్మిది అద్భుతాలలో ఒకటి. పన్నెండవశతాబ్దం ఏడవదశకంలో నిర్మించబడిన ఈ గోపురం అప్పటినుంచే ఒక పక్కకు వాలడం ప్రారంభమయింది. అలా క్రమేణా అది 13 అడుగులు వాలిపోయింది. ఈ వాలును కొద్దిగా సరిచేయడానికి ఒకపథకంరూపొందించారు.దాని ప్రకారంగోపురం వాలు 40 సెం.మీ.(1 అడుగు 4 అంగుళాలు) సరిచేయడానికి పది సంవత్సరాలుపట్టింది. అంటే ఇప్పుడు గోపురాన్ని మూడు శతాబ్దాల పూర్వం ఉన్నస్థితికి తీసుకువచ్చారన్నమాట. 1990 నుంచి గోపురంలోకి సందర్శకులను అనుమతించడంఆపివేశారు.ఏప్రిల్‌లోఅధికారులుచేసిన ప్రకటన ప్రకారం త్వరలో సందర్శకులను గోపురంలోకి అనుమతిస్తారు. ప్రవేశ రుసుము 12 అమెరికన్ డాలర్లు (సుమారు 500 రూ.)గా నిర్ణయించారు.

## గగారిన్ గౌరవార్థం!

ప్రపంచంలోనే ప్రప్రథమంగా అంతరిక్షయానం చేసినవాడు యూరీగగారిన్. అతడు అంతరిక్షయానం చేసి ఈ ఏప్రిల్ 12వ తేదీకి 40 ఏళ్ళు పూర్తవుతుంది. ఈ సందర్భంగా గగారిన్ గౌరవార్థం మనదేశం ప్రత్యేక పోస్టేజ్ స్టాంపులు విడుదల చేసింది. 1961 ఏప్రిల్ 12వ తేదీ వోస్టాక్-1లో అంతరిక్షంలోకివెళ్ళి, 108 నిమిషాలపాటు భూమిని చుట్టివచ్చాడు. పొలంలో పనిచేస్తూ మామూలుగా జీవితాన్ని ప్రారంభించిన యూరీగగారిన్అంతరిక్షయానం చేసిన తొలిమానవుడయ్యాడు.అతడుచేసిన అంతరిక్షయానం ఇరవైయవ శతాబ్దం సాధించిన ఘనవిజయాలలో ఒకటిగా చరిత్రలో చిరస్థాయిగా నిలిచి ఉంటుంది!



## అతని పేరే డాట్‌కామ్!



గుర్తింపుకోసం లేదా న్యూమెరాలజీ మీది నమ్మకంకొద్దీ, కొందరు పేర్లు మార్చుకోవడం పరిపాటి. జెరూసలెంలో టోమెర్ క్రిస్పీ అనే కంప్యూటర్ ప్రోగ్రామర్ ఉన్నాడు. తాను చేసే వృత్తిని చాటేలా తనపేరు ఉండాలన్న ఉద్దేశంతో అతను తన పేరును టోమర్ డాట్ కామ్ అని మార్చేసుకున్నాడు. దీనిని ఇంటర్‌నెట్ చిరునామాగా పొరబడకండి. అతడి పేరే అది. ఇజ్రాయెల్ ప్రభుత్వం అతని కొత్త పేరును అంగీకరించి, పాస్‌పోర్ట్, ఐడెంటిటీ (గుర్తింపు) కార్డు జారీ చేసింది.



## రెక్కలమీద నడక!

అమెరికాలోని పింక్ ఫ్లాయెడ్ గ్రూప్ సంగీత బృందానికి చెందిన డ్రమ్మర్ నిక్ మేసన్ కొడుకు గై మేసన్. ఈ పదేళ్ళ కుర్రాడు ఇటీవల 'బై-ప్లేన్' (చిన్న విమానం) రెక్కలమీద నడిచాడు. ఆ విధంగా ఈ బుడతడు ప్రపంచంలోనే అతి పిన్నవయసు 'వింగ్ వాకర్'గా పేరు తెచ్చుకున్నాడు.

## సింగపూర్‌లో 'స్పైడర్‌మేన్'

ఫ్రాన్స్‌కు చెందిన అలైన్ రాబర్ట్ అనే యువకుడికి ఆకాశాన్నంటే ఎత్తయిన భవనాలమీదికి ఎగబ్రాకాలంటే యమ సరదా. అదే అతడి హాబీ. గత నవంబర్‌లో అతడు 21 అంతస్థుల (దాదాపు 900 అడుగులు) బ్యాంక్ టవర్‌ను ఎక్కడం ప్రారంభించాడు. అతడు ఆ విషయం గురించి పోలీసులకు ముందే తెలియజేయక పోవడంవల్ల దానిని చూస్తూ పోలీసులు ఊరుకోలేకపోయారు! ఇప్పుడు అతడు మళ్ళీ సింగపూర్‌కు వచ్చి ఆసియాలోకెల్ల అతి ఎత్తయిన హోటల్ భవనాన్ని నాలుగువైపులా పరిశీలించి చూస్తున్నాడు. అతడు తేదీ నిర్ణయించాక పోలీసుల అనుమతి తీసుకోవాలి. పోలీసుశాఖ కూడా తప్పక ఓకే చెబుతుంది!



# మనదేశం గురించి తెలుసుకుందాం!

## క్విజ్

జూలై 11వ తేదీని ప్రపంచ జనాభాదినంగా జరుపుకుంటున్నాం. మనదేశంలో ఇటీవల అంటే ఫిబ్రవరిలో 14వ జనాభాసేకరణ జరిగింది. మనదేశ జనాభా వివరాల గురించి మీకు ఎంతవరకు తెలుసో చూద్దామా?

1. మనదేశంలో శాస్త్రీయంగా 'జనాభాలెక్కల' సేకరణ ఎప్పుడు జరిగింది?
2. మనదేశ జనాభాలో పిల్లల (పధ్నాలుగేళ్ళలోపు) శాతం ఎంత?
3. అతితక్కువ జనాభా కలిగిన రాష్ట్రం ఏది?
4. మొత్తం జనాభాలో ఏ వయసుకు చెందినవాళ్ళు అధిక శాతం ఉన్నారు?
5. 'గిరిజనుల' జనాభా అధికంగాగల రాష్ట్రం ఏది?
6. దేశం మొత్తం జనాభాలో క్రైస్తవుల శాతం ఎంత?
7. గత మూడు దశాబ్దాలుగా రెండు మతాలకు చెందినవారి జనాభా పెరుగుతోంది. ఆ రెండు మత విభాగాలు ఏవి?
8. అత్యధిక జనాభాగల నగరం ఏది?
9. పట్టణాలు అధికంగాగల రాష్ట్రం ఏది?
10. అతి తక్కువ జనసాంద్రతగల రాష్ట్రం ఏది?
11. నగర జనాభా నిష్పత్తి అధికంగాగల రాష్ట్రం ఏది?
12. ఉర్దూకు రెండవ అధికార భాషా ప్రతిపత్తి కల్పించిన రెండు రాష్ట్రాలు ఏవి?

(ఈ ప్రశ్నలకు సమాధానాలు వచ్చే సంచికలో)

## మార్చ్ సంచిక క్విజ్ సమాధానాలు

1. మేవార్ యువరాణి మీరా.
2. భక్త సూరదాసు.
3. 15-16 శతాబ్దాల మధ్య జీవించిన చైతన్య మహాప్రభు.
4. ద్వారక, జ్యోతిర్మఠం, పూరీ, శృంగేరి, కంచి.
5. అవ్వైయ్యార్.
6. 15-16 శతాబ్దలమధ్య జీవించిన భక్త కబీరు. అల్లా అన్నా, రామ్ అన్నా, దేవుడు ఒక్కడే అని ఆయన తన గీతాలలో చాటాడు.
7. షిర్డీ సాయిబాబా.
8. రామానుజాచార్యులు.

# పెళ్ళిమాటలు!

ఒకసారి గోపీనాధుడనే పండితుడు పొరుగునవున్న కృష్ణాపురం అగ్రహారంలో, తన మిత్రుణ్ణి చూడబోయాడు. ఆరోజు మధ్యాహ్నం భోజనాలయ్యాక, ఆయనా, మిత్రుడూ కబుర్లాడు తూండగా, పక్కనవున్న ఇంట్లోంచి ఒక రెండేళ్ళ బాలిక తప్పటడుగులు వేస్తూ, అక్కడికి వచ్చింది. ఎర్రగా బొద్దుగా వున్న ఆ బాలిక ఏదో మాట్లాడాలని చిలకపలుకులు పలుకు తూండగా, ఆ బాలిక తండ్రి కూడా అక్కడికి వచ్చాడు.

గోపీనాధుడు, ఆ బాలికను చూసి ముచ్చటపడి, ఆ వచ్చినాయన ఆ బాలిక తండ్రి అని తెలుసుకుని, ఛలోక్తిగా, '' ఏమండీ, మీ అమ్మాయి అచ్చు బాలలక్ష్మిలా వున్నది. నాకొక్కడే కొడుకు. వాడికి నాలుగేళ్ళ వయసు; ఏ బాలకృష్ణుడో అన్నట్టుంటాడు. పెళ్ళిమాట, వాళ్ళు యుక్త వయస్కులయ్యాక - ప్రస్తుతానికి నిశ్చితార్థంలాంటివి చేస్తే ఎలావుంటుందంటారు?'' అన్నాడు.

''మా అమ్మాయిని ముసలాయనకిచ్చి కట్టబెట్టమంటారా ఏం?'' అన్నాడు బాలిక తండ్రి కోపంగా.

ఆయన మాటలు అర్థంకాక గోపీనాధుడు ఆశ్చర్యపోయాడు. అప్పుడు బాలిక తండ్రి పెద్దగా చిటికె వేసి, ''వినండి! మీ అబ్బాయి వయసు నాలుగేళ్ళు; మా అమ్మాయి వయసు రెండేళ్ళు. అంటే, మీ అబ్బాయి వయసులో సగం మాత్రమే. అలాంటప్పుడు, మా అమ్మాయిని ఇరవై ఏళ్ళ వయసులో, మీ అబ్బాయికిచ్చి పెళ్ళిచేయడమంటే, అప్పటికి వాడి వయసు నలభై. ఒకవేళ మా అమ్మాయికి ఇరవై ఐదేళ్ళ వయసులో పెళ్ళి చేస్తే, మీ వాడికి యాభై ఏళ్ళ వయసవుతుంది; అవునా? మరి, ఆ వయసువాడు ముసలివాడు కాదంటారా?'' అని అడిగాడు.

బాలికతండ్రి అమాయకత్వాన్నీ, అజ్ఞానాన్నీ గ్రహించి, గోపీనాధపండితుడు మౌనంగా వూరు కున్నాడు.





వ్యాఖ్యలు రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ





ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వతేదీలోగా మాకు అందేలా పంపాలి.పోటీ ఫలితాలు సెప్టెంబర్ 2001 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82,డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.

## అభినందనలు

మే 2001 సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు:
శ్రీమతి కొప్పర్తి సావిత్రి,
కేరాఫ్ కె. యెగ్గన్న,
23-19-4, సత్యనారాయణపురం,
విజయవాడ-520 011.(ఆం.ప్ర)





మొదటి ఫోటో: మనసే పూల సుగంధం
రెండవ ఫోటో: మమతలొలికే పూలబంధం!!